# వర్షిణి

## ప్రసంగ సంపుటి

డా॥ ఎస్.ఎస్. రాజు
ఎం.ఏ. , ఎం.ఫిల్, పిహెచ్.డి.

యశస్విని పబ్లికేషన్స్
సరస్వతిమహల్, కోహెడ,
జి॥ కరీంనగర్ - 505 473
✆ : 08721-254162

# వర్షిణి
ప్రసంగ సంపుటి

ప్రథమ ముద్రణ :
**జూన్, 2003**

కవర్ డిజైన్ :
**ఎస్. రత్నప్రభ**

వెల :
**రూ. 30/-**

**ప్రతులకు :**
డా॥ ఎస్.ఎస్. రాజు
సరస్వతిమహల్,
కోహెడ - 505 473
కరీంనగర్ జిల్లా
ఫోన్ : 08721-254162

**ముద్రణ :**
సాగర్ గ్రాఫిక్స్,
మిషన్ హాస్పిటల్ రోడ్, కరీంనగర్

# అంకితం

శ్రీమతి వడ్లూరి శ్రీమతి

శ్రీమాన్ వడ్లూరి సుధాకర్‌రాజు

దంపతులకు

డా॥ ఎస్.ఎస్.రాజు

## 'వర్షిణి' గురించి......

ఆకాశవాణిలోను, సాహితీసదస్సుల్లోను, రచయిత/కవి మిత్రుల గోష్ఠుల్లోను అప్పుడప్పుడు డా॥ఎస్.ఎస్.రాజు గారు చేసిన ప్రసంగాలను కొద్దిపాటి మార్పుచేర్పులతో ఇలా 'పుస్తకంగా' మీ ముందుకు తెస్తున్నందుకు సంతోషంగా ఉంది.

మాట్లాడడం, నవ్వడం, స్నేహం చేయడం, కోపానికిరావడం, చూడడం, డబ్బు అధికారాలకై ఆరాటపడడం వంటివి ప్రతి మనిషి జీవితంలో తప్పని సరిగా చేస్తున్న, చేయకతప్పని పనులు. అయితే ఈ పనులన్నింటినీ అందరూ ఒకే విధంగా, ఒకేస్థాయిలో చేయరు, చేయలేరు కూడా... ఎవరికి వారు తమకు తమకు ఇష్టమైన, వీలైన, సాధ్యమైన, పద్ధతుల్లోనే మాట్లాడుతారు, నవ్వుతారు...

సమాజంలోని మనుష్యులు మాట్లాడే, నవ్వే, చూసే, తీరుతెన్నులను కొన్ని విభాగాలుగా విభజించి "తనకున్న సామాజిక బాధ్యతను సరిగ్గా నిర్వర్తించడానికై మనిషిని కర్తవ్యోన్ముఖున్ని చేసే దిశగా" డా॥ ఎస్.ఎస్.రాజు గారు చేసిన ప్రసంగాలివి.

హాస్యం, అధిక్షేపాలను తగు పాళ్లలో మేళవించి, అవసరమున్నంత నీతిని, విజ్ఞానాన్ని చక్కగా జోడించి, ఆద్యంతం పాఠకుల్ని ఆసక్తిగా చదివించే శైలిలో కూర్చబడిన ఈ ప్రసంగాలు, మీ అందరి ఆదరాభిమానాలను చూరగొంటాయన్న నమ్మకం మాకుంది.

ఇట్లు
**సరస్వతి రత్నప్రభ**
ప్రధాన కార్యదర్శి
యశస్విని పబ్లికేషన్స్

# నా మాట

దాదాపు పదిహేనేళ్లుగా రాస్తున్నా........................ మొదట్లో కథలు, నాటికలు తరువాత కవితలు, వ్యాసాలు అటు తరువాత ప్రసంగాలు, విమర్శలు........... మధ్యలో పరిశోధనలు ఉపన్యాసకవృత్తి ఒకవైపు................. ఈ వ్యాసంగమంతా ఒకవైపు............... అన్నింట్లో వేలు పెట్టానన్న సంతృప్తి........ ఒక్కోసారి అదే విషయంలో అసంతృప్తి వెరసి................ సాదాసీదాగా సాగిపోతున్న జీవితం నాది. ఇందులోని 'థ్రిల్' మరెందులోనూ లేదని గట్టిగా నమ్మే ఫిలాసఫీ. "ఈ తరహా జీవితానందాన్ని ఎవరైనా అనుభవించి తెలుసుకోవలసిందే, తప్ప మాటల్లో చెబితే అర్థమయ్యేది కాద" ని మనవి చేసుకుంటున్నాను.

హృదయం స్పందించినప్పుడు రాయకుండా ఉండలేను మిగతా సమయాల్లో లక్షలిస్తామన్నా కలం కదలదు. ఇది బలమో, బలహీనతో తెలియదు. ప్రత్యేకంగా ఫలానా విషయంపైననే, ఫలానా ప్రక్రియలోనే రాయాలన్న నియమం లేదు. పేరు... ప్రఖ్యాతులపైననో... అవార్డులపైననో..... ఆశ ఏకోశానా లేదు. నిర్లిప్తత నివారించలేని స్థాయికి చేరుకుంది కదూ! నాకూ అలాగే అనిపిస్తుంది... వదిలేయండి.

"ఇవ్వడమన్నది మనిషిని 'దాత' గా చేస్తే తీసుకోవడమన్నది 'గ్రహీత' గా నిలబెడుతుంది. తీసుకోవడం అవసరమైనప్పుడు తప్పకుండా తీసుకోవాలి. అయితే తీసుకోవడం తోనే సరిపెట్టుకోకుండా అవకాశం వచ్చినప్పుడు బదులివ్వడం మార్యాద" అన్నది నేను నమ్మిన నీతిసూత్రం.

1994లో శ్రీమతి & శ్రీ వడ్లూరి సుధాకర్ రాజు దంపతులు తమగారాల పట్టిని కన్యాదానంగా ఇచ్చి నన్ను 'గ్రహీత'ను చేశారు. ధర్మబద్ధంగా, కన్యా'దాత'లై అగ్ని సాక్షిగా నన్ను 'గ్రహీత'ను చేసిన ఆ దంపతులకు, వారి షష్ఠిపూర్తి మహోత్సవ సందర్భంగా నా మానస పుత్రికయైన 'వర్షిణి' ని అంకితమివ్వడం, ధర్మబద్ధంగా బదులివ్వడమేనని నమ్ముతున్నాను.

'గ్రహీత' గానే నన్ను మిగిలి పోనివ్వకుండా 'దాత' గా నిలిచిపోయేందుకు అవకాశమిచ్చిన వారి సౌజన్యానికి ధన్యవాదాలు.

ఇంకా,

నా తల్లితండ్రుల ఆశీర్వాదబలం నాకుంది. నా ఇల్లాలి అండదండలు దండిగానే ఉన్నాయి. 'నా' అన్నవాళ్ల ఆదరాభిమానాలు, నా విద్యార్థుల ఆకాంక్షలు, నా చిన్నారుల ప్రేమానురాగాలు నన్నుముందుకు నడిపిస్తున్నాయి.

నేనంటూ ఒకన్ని ఇంత నిర్భయంగా, దర్జాగా నిలబడి ఉన్నానంటే ఆ ఘనత నా వెనకాల నిలబడి ఉన్న వాళ్లందరిదే... నాదేముందండీ! సుమిత్తమాత్రున్ని........ సాదాసీదాగాన్ని.....................

సెలవు..............

- డా॥ ఎస్. ఎస్. రాజు

## ఇందులో..........

# ఒక మంచి మాట

మానవుడు ప్రధానంగా సంఘజీవి. సంఘం లేదా సమాజం మానవ నిర్మితమే. మనిషి తోటి మనిషితో కలిసి జీవించే క్రమంలో సంఘం ఏర్పడింది. సంఘ నిర్మాణానికి మనిషి పాటుపడ్డాడు. మనిషి మనుగడకు సంఘం బాటలు వేసింది. ఫలితంగా సంఘంతో మనిషికి విడదీయరాని సంబంధమేర్పడింది. ఆ సంబంధం కాలంతోపాటుగా బలపడి, చివరకు సంఘంతో సంబంధం లేకుండా మనిషికి జీవితమే లేదనే స్థితి ఏర్పడింది.

మనిషి మనిషితో కలిసి జీవించే క్రమానికి చేయూతను నిండుదనాన్ని కూర్చిన ఘనత 'మాట'కు దక్కుతుందనడంలో ఎవరికీ సందేహం ఉండనక్కరలేదు. ఈ సృష్టిలోని ప్రాణి కోటిలో మాట్లాడగలిగే శక్తి కేవలం మనిషికి మాత్రమే ఉంది. ఈ శక్తి కారణంగానే మనిషి ప్రాణి కోటిలోకెల్లా సర్వోత్తముడుగా పరిగణింపబడ్డాడు. మిగతా జంతుజాలానికి ఎప్పటికీ అందనంత ఎత్తుకు మనిషి ఎదిగింది కూడా ఈ శక్తి కారణంగానే. అంతే కాదు ఆ జంతుజాలంపై అజమాయిషీని పొందగలిగింది కూడా ఈ మాట్లాడగలిగే శక్తి కారణంగానే అంటే అతిశయోక్తి కాదు. మనిషి జీవితానికి ఆధిక్యతను, వెలుగును, సమాజానికి చైతన్యాన్ని, దిశా నిర్దేశాన్ని ఇచ్చిన 'మాట' మనిషికి దైవదత్తంగా కాకుండా అనుకరణ శక్తి వల్ల అలవడింది కావడం విశేషమే కాదు అద్భుతం కూడా.

తన మనసులో కలిగిన భావాన్ని తలలోని ఆలోచనలతో మేళవించి నోటి సహాయంతో మనిషి చేసే శబ్ద విన్యాసమే 'మాట'. శబ్దానికి జీవం పోసిన భావమే ఆ శబ్దానికొక అర్థాన్ని ఏర్పరచడంలో ప్రధాన భూమికను నిర్వహించింది. అంటే శబ్దార్థాల సమన్వయంలో భావానిదే ప్రధాన పాత్ర అన్నమాట. ప్రతీ శబ్దానికి ఒక అర్థం ఉంటుంది. అది సమయాన్ని, సందర్భాన్ని బట్టి కొన్నిసార్లు అవసరాన్ని బట్టి మరికొన్ని సార్లు మారుతూ ఉంటుంది.

మనిషి పలికే మాట అతని ఆలోచనలను అభిప్రాయాలను, ఇష్టాయిష్టాలను బయట పెడుతుంది. వాటిని అర్థం చేసుకొని తన అభిప్రాయాలను, ఇష్టాయిష్టాలను బయటపెట్టడం ద్వారా ఎదుటిమనిషి 'మాట' వికాసానికి, మానవ సంబంధాల పటిష్టతకు తన వంతు సహాయాన్ని అందిస్తాడు.

ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం, ఒకరి భావాలను మరొకరు తెలుసుకోవడం, పరస్పరం ఒక అవగాహనకు రావడం, భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యే సందర్భాల్లో ఘర్షణలు తలెత్తడం వంటి పనులన్నీ మాటల వికాసానికి తోడ్పడడం ద్వారా నాగరికతాభివృద్ధికి యధాశక్తి సహకరించాయి.

కాలక్రమాన ప్రకృతిలో మనిషిలో సమాజంలో అనేకానేక మార్పులు చోటు చేసుకున్నాయి. ఈ సూత్రం మాటకు కూడా వర్తిస్తుంది. మనిషి అంతరంగంలోని భావం 'మాట'గా పుట్టి భాషగా ఎదిగింది. ఒక భాష నుండి అనంతరకాలంలో మరిన్ని భాషలు పుట్టాయి. వీటిపై మానవజాతుల, కాలాల, ప్రాంతాల ప్రభావం ఉంది. ప్రతి భాషా కాలంతోపాటుగా పెరుగుతూ అనేకానేక శబ్దార్థాలను సమకూర్చుకొని సుసంపన్నం కావడానికి ప్రయత్నించింది. ప్రయత్నాలు విఫలమైన భాషలు కొన్ని కాలగర్భంలో కలిసిపోయాయి. భాషల నిర్మాణంలో కనిపించే పోలికలాధారంగా భాషాశాస్త్రజ్ఞులు భాషలను కొన్ని కుటుంబాలుగా వర్గీకరించారు. వివిధ వర్గాలకు చెందిన భాషలను మేళవించి 'ఎస్పెరాన్‌చో' పేరుతో 'ప్రపంచ భాష'ను నిర్మించే ప్రయత్నం జరిగినా అది పూర్తిగా సఫలం కాలేదు.

భావానికి బహిరాకృతిగా నిలిచే 'మాట' భాషగా ఎంత ఎదిగినా, ఎన్ని మార్పు చేర్పులకు గురైనా, తన స్థాయిని స్థానాన్ని ఖ్యాతి గౌరవాలను ఏ మాత్రం కోల్పోలేదు. మాట్లాడడం ద్వారా మనిషి సమాజంలో పొందే స్థానంలో ఈనాటికీ పెద్దగా మార్పులేదనే చెప్పాలి. నిన్నైనా, నేడైనా, ఆమాటకొస్తే రేపైనా ఆ మరునాడైనా సమాజంలో మనిషిస్థాయిని స్థానాన్ని నిర్ణయించడంలో మాటదే కీలకస్థానమంటే అతిశయోక్తి కాదు.

సమాజంలో సభ్యుడై, ఒక బాధ్యత కలిగిన పౌరుడై నివసించే మనిషి కేవలం రెండే రెండు సందర్భాల్లో జాగ్రత్తగా మాట్లాడితే చాలు. అతడు తప్పకుండా గొప్పవాడౌతాడట. అలాగే ఒకే ఒక్క సందర్భంలో ఆవేశానికీ, అత్యుత్సాహానికీ లోను కాకుండా వింటే చాలు. అతడు ధన్యుడౌతాడట. ఇదేదో గమ్మత్తుగా చిత్రంగా, అంతకంటే విచిత్రంగా అనిపిస్తుంది కదూ! నిజమే

<u>మనిషి జాగ్రత్తగా మాట్లాడవలసిన రెండు సందర్భాలు ఇవి :</u>

1. ఇతరులను గురించి తను మాట్లాడేటప్పడు

2. తన గురించి తను మాట్లాడేటప్పడు

- ఇక తను ఆవేశానికీ, అత్యుత్సాహానికీ లోను కాకుండా వినదగిన ఆ ఒక్క సందర్భమిది.

1. తన గురించి ఇతరులు మాట్లాడుతున్నప్పుడు.

ఆహా! ఎంత గొప్పగా సెలవిచ్చారండీ!

మాటల్ని మాట్లాడేటప్పడు, వినేటప్పడు, ప్రతీ క్షణం తగినంత జాగ్రత్త వహించుమని చెప్పకనే చెప్పారు కదా! మహానుభావులు. ఈ మాటలు సమాజంలో 'మాట' కున్న మహత్తరమైన స్థానాన్ని చాటుతున్నాయంటే అతిశయోక్తి కాదు.

" నిర్లక్ష్యంగా మాట్లాడడం వలన లేనిపోని అపార్థాలు, అధిక నష్టాలే కాదు యుద్ధాలు కూడా రావచ్చు" నని ప్రఖ్యాత చైనా తత్త్వవేత్త కన్ఫ్యూషియన్ క్రీపూ. రెండు వేల అయిదు వందల సంవత్సరాల క్రితమే చెప్పిన మాటల్ని ఈ సందర్భంగా గుర్తుచేసుకోవడం అసందర్భం కాదు.

మనిషి పరోక్షంలో సమాజం అతన్ని గురించి చెప్పకునే తీరు తెన్నులే అతని వ్యక్తిత్వ నిర్ధారణకు మూలమౌతాయి. కేవలం తన మాట ద్వారా, తను మాట్లాడిన మాటలకు కట్టుబడి ఉండడం ద్వారా తన మాటలకనుగుణంగా తన చేతల్ని సమన్వయపరచడం ద్వారా మాత్రమే మనిషి తనను తాను 'గుణవంతుడు' లేదా ' 'బుద్ధిమంతుడు' గా నిరూపించుకోగలడు. 'నోట్లోకి పోయేది కాదు నోటినుండి వచ్చేది మనిషిస్థాయిని నిర్ణయిస్తుంద" న్న ఆర్యోక్తి ఈ సందర్భంగా గమనార్హం.

తన మాట ద్వారానే తనస్థానం నిర్ధారింపబడుతుందని, తద్వారానే తన కీర్తిప్రతిష్టల స్థాయి నిర్ణయింపబడుతుందనే విషయం మనుష్యులందరికీ దాదాపుగా తెలుసు. తెలిసి కూడా అనేకులు ప్రవర్తించే తీరు తెన్నులను పరిశీలిస్తే ఎన్నో ఆశ్చర్యకరమైన, వింతైన, విడ్డూరమైన విషయాలు విశేషాలు వెల్లడౌతాయి. ఆ వింతలను, విడ్డూరాలను కాసేపు సరదాగా వీక్షించడమే మనమిప్పడు చేయబోయే పని.

బాగా డబ్బున్న మనిషిని సమాజం ధనవంతునిగా గుర్తిస్తుంది. కాని గుణవంతునిగా కాదు. అతడు 'గుణవంతుడు' అని సమాజం చేత అనిపించుకోవడానికి అతని 'మాట' తీరే ప్రధానమౌతుంది కానీ ధనం కాదు. కొందరు మనుష్యులు అతని చుట్టూ చేరి తమ అవసరాలు తీర్చుకోవడం కోసం అతన్ని గుణవంతుడుగా కీర్తించవచ్చు. ప్రస్తుతించవచ్చు. తమ అవసరాలు తీరిన మరుక్షణమే ఆ కీర్తించడాలు, ప్రస్తుతించడాలు వినిపించవు. కొండొకచో సదరు ధనవంతుడే కొందరు 'నమ్మకస్తులైన' మనుష్యులను కూడగట్టుకొని వాళ్ళకు డబ్బిచ్చి తనను గుణవంతునిగా ప్రచారం చేయమని కోరవచ్చు. అతని ముందు 'సరే' అని తలలూపి ఆ డబ్బుతీసుకున్నవాళ్లు అతడు కోరినట్లుగానే ప్రచారం చేస్తారు. అతడు డబ్బిస్తున్నంతకాలం ఆ ప్రచారం అలా కొనసాగుతూనే ఉంటుందని ఎవరైనా తేలికగానే ఊహించవచ్చు. డబ్బివ్వడం ఆగిపోయిన మర్నాడే ప్రచారం కూడా ఆగిపోతుంది.

అంతేకాదు

అంతవరకు సాగిన ప్రచారం వెనుక ఉన్న అసలు నిజాన్ని ఆ నమ్మకస్తులే 'ఉచితం'గానే ప్రజలందరికీ తెలియజేస్తారని మీకు ప్రత్యేకంగా చెప్పనవసరం లేదనుకుంటాను. అందుచేత డబ్బు ఖర్చు చేసి కూడా ఎవరూ తమను తాము గుణవంతులుగా నిరూపించుకోలేరని మాత్రం ఈ సందర్భంగా మనవి చేయదలచాను.

ఇకపోతే !

సమాజంలో కొందరు మనుష్యులు ఎందుచేతనో తెలియదు కాని అతి విలువైన మాటల్ని ఏరి కూర్చుకొని మరీ ప్రయోగిస్తుంటారు. అనేకులకు అనవరతంగా అనేకానేక నీతి సూత్రాలను బోధించడంలో వీళ్ళు ఘనాపాఠీలు చెప్పేవన్నీ శ్రీరంగనీతులే సుమా. (ఈ మాట వినగానే మీకు అదేదో సామెతలోని రెండవసగం గుర్తుకొస్తే నా పూచీ లేదు) మంచి మాటలెన్నైనా చెబుతారు. అయితే ఆచరణ మాత్రం శూన్యం. పైగా తాము చెప్పే మాటల్ని ఇతరులు ఆచరించాలే తప్ప తాము ఆచరించవలసిన పనిలేదని అడ్డంగా, నిలువుగా, ఐ మూలలుగా ఎటుపడితే అటు ఎడాపెడా వాదించేస్తారు. వీళ్లు చెప్పేవి మంచి మాటలే. అయినా చెబుతున్నది వీళ్లు కావడంచేత అంత మంచి మాటల్ని కూడా సమాజం తేలికగా తీసేస్తుంది. వీళ్ళమాటల్లాగే వీళ్లను కూడా తేలికగా తీసేస్తుంది. పనికిమాలిన వాళ్ల జాబితా వీళ్లపేర్లతోనే మొదలౌతుంది.

కొందరి మాటతీరు వాళ్ల ప్రవర్తనలాగే ఏ మాత్రం కొరుకుడు పడకుండా ఉంటుంది. తమ కళ్లెదురుగా జరుగుతున్న విషయాన్ని గురించి ఏ మాత్రం పట్టించుకోకుండా తమదైన ధోరణిలో మాట్లాడుతుంటారు వీళ్లు. తెలిసి తెలిసి అలా ఎలా మాట్లాడగలుగుతున్నారన్న విషయం బుర్రలు బద్దలు కొట్టుకున్నా ఎదుటివారికి అర్థం కాదు. వింత వింత సిద్ధాంతాలు, విపరీత ధోరణులు వీళ్ల మాటల్లో వ్యక్తమౌతుంటాయి. 'బట్టతలకు మోకాలుకు ముడిపెట్టేరకం' మనుష్యులుగా వీళ్లను సమాజం నిర్ణయిస్తుంది.

కొందరు మాట్లాడితే ఏమీ అర్థం కాదు. అయితే వాళ్లు మనకు తెలిసిన భాషలోనే మాట్లాడుతారు. కానీ ఆ మాటల తీరు అలా ఉంటుంది మరి. ఎదుటివాళ్లకు ఎంత అర్థం కాకుండా మాట్లాడితే తామంత గొప్పవాళ్లమని భావించుకునే పుణ్యపురుషులు ఉన్నారు.

కొందరు మాట్లాడుతారు మల్లెలు విరబూసినట్లు. మందారాలు పొంగిపూచినట్లు. మకరందం పెల్లుబికినట్లు మాధుర్యం పొంగిపొరలినట్లు మళ్లీ మళ్లీ వినాలనిపించేటట్లు.

మరికొందరు మాట్లాడుతారు ఉరుములు ఉరిమినట్లు, పిడుగులు రాలినట్లు, నాటుబాంబులు ప్రేలినట్లు.

కొందరు మాటల్ని గురిచూసి సూటిగా ప్రయోగిస్తారు. 'మొహం మీద కొట్టినట్లు', 'కుండబద్దలు కొట్టినట్లు' మాట్లాడుతారన్న వాక్యాలు వీళ్ల మాటలనుద్దేశించి అన్నవే.

మాటలను తూటాల్లాగా పేల్చేవాళ్లు కొందరైతే ఏ లక్ష్యం లేకుండా అనాలోచితంగా మాట్లాడేవాళ్లు అనేకులు.

కొంతమంది తెలివిగా మాటలతో వలల్ని పన్నుతారు. అందులో చిక్కుకున్న అమాయకులను (రాళ్లను) అలవోకగా నమ్మిస్తారు. తమ అవసరాలను తీర్చుకొని ఆనక నట్టేట్లో ముంచేస్తారు. తాము మాటకారులమని గర్వంగా మీసం మెలేస్తారు. మాట విలువకు మచ్చ తెచ్చే ఈ తరహా మనుషులంతా తర్వాతి జన్మలో మూగవాళ్లుగా పుడతారని ఎక్కడో చదివినట్లుగా గుర్తు. కొందరు తమ మాటలతో ఎదుటివాళ్లను సులభంగా కట్టిపడేస్తారు. ఇలా ఎదుటివాళ్లను కట్టిపడేయడం ఇష్టంలేని కొందరు తమ మాటలతో ఏకంగా పెద్దపెద్ద కోటల్నే కట్టేస్తారు. అదేం చిత్రమో కానీ ఈ సమాజం వీళ్లను గురించి కానీ, వీళ్ల కోటల గురించి కానీ అసలేమాత్రం పట్టించుకోదు.

ఎదుటి మనిషి కష్టాల రథచక్రానెత్తుతున్న సమయాన్ని కనిపెట్టి, అతన్ని మరింతగా కష్టపెట్టే మాటల్ని ప్రయోగించే వాళ్లు కొందరైతే మాటల బాణాలతో ఎదుటివాళ్ల హృదయాలను తీవ్రంగా గాయపరిచేవాళ్లు కొందరు.

మహాభారతంలో ఒక చోట తిక్కన మహాకవి.

"తనువున విరిగిన యలుగులు
ననువున బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
వినుమెన్ని ఉపాయములను వెడలునె యధిపా"

(శరీరంలో దిగబడిన బాణశకలాలను నేర్పుతో, ఓర్పుతో తొలగింపవచ్చు. వాటి తాలూకు గాయాలను నెమ్మది మీద మాన్పవచ్చు. కానీ హృదయంలో కఠినంగా నాటిన మాటల బాణాలను తొలగింపజాలము, వాటి తాలూకు గాయాలను మాన్పగలేము) అంటారు. మహాకవి మాటలు అక్షరసత్యాలనే విషయం నూటికి నూరుపాళ్లు నిజం.

సమయ, సందర్భాలను పట్టించుకోకుండా చెప్పకూడని మాటల్ని చెప్పి ఎదుటిమనిషిని కష్టాల సుడిగుండంలోకి నెట్టేవాళ్లు కొందరు. " చావుకబురు చల్లగా చెప్పినట్లు" అనే నానుడికి జీవం పోసిన పుణ్యమూర్తులకు వీళ్లు అనుంగుసోదరులని మీకు ప్రత్యేకించి మనవి చేయనక్కరలేదనుకుంటాను.

అర్థం, పర్థం లేకుండా అనవసరపు మాటల్ని అధికంగా మాట్లాడి తమ పీకలమీదికి తెచ్చుకునే మహానుభావులు ఈ ధరిత్రిలో దండిగానే ఉన్నారు. ముందు వెనుకలాలోచించకుండా నోరు జారడం ఆనక తెలివి తెచ్చుకొని క్షమాపణలు కోరడం కొందరికలవాటే. మాటకోసం తమ ప్రాణాలను తృణప్రాయంగా ఎంచేవాళ్లు కొందరైతే. తమ సౌఖ్యంకోసం మాటల్ని మార్చేవాళ్లు ఎందరో. సౌఖ్యం కోసం కాదు కానీ తమ ప్రాణాలకు ప్రమాదమేర్పడినప్పుడు మాత్రం మాటకు విలువనీయనక్కర లేదని విజ్ఞులేనాడో సెలవిచ్చారు.

మాటలతో ఎదుటివాళ్ల హృదయ సామ్రాజ్యాలను గెలుచుకోగలవాళ్లు చాలా అరుదుగా కనిపిస్తారు. తమ మాటలతో ఎదుటి వాళ్లను ఆనందపరిచేవాళ్లు, అభాగ్యులను ఓదార్చుతూ దగాపడ్డ వాళ్లకు ధైర్యానిచ్చేలా మాట్లాడేవాళ్లు అణగారిన వర్గాలకు అండగా నిలుస్తూ సాటి ప్రజల్లోని అజ్ఞానతిమిరాన్ని పారద్రోలి వాళ్లజీవితాల్లో జ్ఞానజ్యోతుల్ని వెలిగించేలా మాట్లాడగలిగే వాళ్లు కొందరైనా ఇంకా ఈ భూమిపైన ఉండడం వల్లనే సూర్యచంద్రులు తమ కిరణాలతో ఈ పుడమిని పునీతం చేస్తున్నారంటే అతిశయోక్తి కాదు.

తాము మాట్లాడుతున్న ఏ విషయం ఎదుటిమనిషికి అర్థం కాకుండా అరవైమైళ్ల వేగంతో మాటల్ని ప్రయోగించేవాళ్లు కొందరు. వీళ్లను " మాటల ఆత్రగాళ్లు" గా చెప్పకోవచ్చు. నత్తనడకను వెక్కిరించేలా మాట్లాడే మహానుభావులకూ వీళ్లకూ ఎప్పుడూ చుక్కెదురే.

బరువైన మాటలను ఎక్కువగా ఉపయోగించడం కొందరికలవాటు. కొందరు తేలికైన మాటలనే ఎక్కువగా వాడుతారు. చాలా కొద్దిమంది మాత్రమే సమయానికి, సందర్భానికి తగినట్లుగా తేలికైన, బరువైన మాటల్ని వాడితే అనేకులు అవేవి పట్టించుకోకుండా తమకు తోచినట్లుగా మాట్లాడుతూ ఉంటారు.

కొందరు ఆచి తూచి మాట్లాడుతారు. వీళ్లలో ఎక్కువ మంది భయస్తులు, బిడియస్తులు ఉంటారు. మిక్కిలి వినయగుణ సంపన్నులు కూడా వీళ్లలో ఉండే అవకాశముంది. కొందరు ఉదారంగా మాట్లాడుతారు. కొందరైతే అసలే మాట్లాడరు. 'మాట్లాడితే నోటిముత్యాలు రాలుతాయని భయమా!' అని ఇతరులు వీళ్లను ఆటపట్టిస్తుంటారు. అయినప్పటికీ వీళ్ళు తమ మౌనాన్ని వీడరు. అడపా, దడపా మాట్లాడే వాళ్లుండబట్టే, అడ్డూ అదుపూ లేకుండా మాట్లాడేవాళ్లు తయారయ్యారు. విషయమేదైనా ఉంటేనే మాట్లాడేవాళ్లు కొందరైతే. విషయమేమి లేకపోయినా గడగడా మాట్లాడేవాళ్లు ఎందరో ఉన్నారు. వినేవాడుండాలే కానీ, ఏకబిగిన ఏడురోజుల పాటు మాట్లాడే మహానుభావులు కూడా ఉన్నారని గమనించ ప్రార్థన.

మరికొందరుంటారు వీళ్లకు మాట్లాడడం తప్ప మరోపని చేతకాదు. తమ ఎదురుగా ఎంత ఎక్కువమంది కనబడితే అంతగా రెచ్చిపోయి మాట్లాడుతారు. తమ మాటలతో ఎదుటివాళ్ల చెవుల్లో పువ్వులను పెట్టడంలో, వాళ్లను మభ్యపెట్టడంలో వీళ్లు సిద్ధహస్తులు. మాటల్ని టన్నులకొద్దీ దానం చేసే వీళ్లంతా రాజకీయాల్లో రాణిస్తారన్న విషయం ప్రజాస్వామ్య భారతం సాక్షిగా ఏనాడో నిరూపించబడింది.

ఇంకొందరు మాట్లాడుతారు మాటలు అవే కాని వాటి భావాలు. అర్థాలు అవికావు. అవేకాని మాటలకు అవే అర్థాలని వేరుగా చెప్పనవసరం లేదనుకుంటాను. ఆ మాటల్లో 'ధ్వని' ఉందని కొందరంటారు. 'అవునంటే కాదనిలే, కాదంటే అవుననిలే' ........ అని ప్రసిద్ధిచెందిన వాక్యాలకు అన్వయించే మాటల్ని కొందరు మాట్లాడుతుంటారు.

ఏది ఏమైనా కూడా!

ఎవరెలా మాట్లాడుతారు అనే దానిపైనే. ఎవరెలాంటివారు అన్నది ఆధారపడి ఉంటుంది. అందువల్ల అందరినీ మెప్పించే విధంగా కాకపోయినా సాటిప్రజల్లో అధిక సంఖ్యాకుల్ని మెప్పించగలిగే విధంగా మాట్లాడాలి. తమ మనసులోని భావాల్ని ఎదుటివాళ్లకు తెలియజెప్పడమే మాట పరమోద్దేశ్యమైనప్పటికినీ, ఎదుటివాళ్లకు ఆనందాన్నిచ్చి వాళ్ల అంగీకారాన్ని పొందడమే తాము మాట్లాడే మాటలకు అత్యుత్తమ లక్ష్యమని మాట్లాడగలిగే శక్తిగల ప్రతిమనిషి గుర్తెరగాలి. అందుకనుగుణంగా కృషి చేయాలి. ఆ కృషిలోని నిజాయితే అతని కీర్తి ప్రతిష్టలకు, సమాజంలో అతని స్థానానికి మూలమౌతుందంటే అతిశయోక్తి కాదు మరి

అందుకే,

"నొప్పింపక తానొవ్వక మాట్లాడుతు మసలువాడు మాన్యుడు" - అని మనవి చేసుకుంటున్నాను.

# నవ్వుల నదిలో.....

"నవ్వును జంతువుల్ నరుడు నవ్వును నవ్వులు చిత్తవృత్తికిన్
దివ్వెలు కొన్ని నవ్వులెటుతేలవు కొన్ని విషప్రయుక్తముల్
పువ్వులవోలె ప్రేమ రసముల్ వెలిగ్రక్కు విశుద్ధమైనలే
నవ్వులు సర్వదుఃఖ దమనంబులు వ్యాధులకున్ మహౌషధుల్"

అని కవి చక్రవర్తి జాషువా నవ్వులను గురించి వ్యాఖ్యానించారు. నవ్వు సంతోషానికి ప్రతీక. ఉప్పొంగే హృదయానికి పతాక. ఒక విధంగా చెప్పాలంటే మనసులోని భావానికి నవ్వు భాష్యం వంటిది. అన్ని రకాల దుఃఖాలను దూరం చేయగలిగే శక్తి, మందే లేదని ప్రచారం పొందిన మనోవ్యాధికి మహౌషధం కాగలిగిన శక్తి, విశుద్ధమైన లేత నవ్వులకు ఉందనే విషయాన్ని జాషువాగారి పై పద్యం తెలియజేస్తుంది. కాగా నవ్వడం అనేది నిజంగా ఒక గొప్ప అదృష్టమనే చెప్పాలి. ఆ అదృష్టం కూడా కాలాన్ననుసరించి మారేదికాదు కాబట్టి, నవ్వగలిగేవాడు ఎల్లప్పుడూ అదృష్టవంతుడేనని చెప్పడంలో అసత్యం ఏమీ లేదు.

రోజూ కాసేపైనా బాధలు, విషాదాలు, కష్టాలు, కన్నీళ్లూ మరచిపోయి హాయిగా మనస్ఫూర్తిగా నవ్వడం ప్రతి మనిషికి ఎంతో అవసరం. శరీరంలోని రక్త ప్రసరణను క్రమబద్ధీకరించడం ద్వారా నవ్వు మనిషి ఆరోగ్యానికి ఎంతగానో మేలు చేస్తుందని వైద్యశాస్త్రం ధ్రువీకరించింది. హాయిగా నవ్వడం ద్వారా శరీరంలో ఒత్తిడిని తగ్గించే హార్మోన్లు అధిక సంఖ్యలో విడుదలై శరీరాన్ని తేలికపరచి మనసును ఆహ్లాదపరుస్తాయి. అలసటను, విచారాన్ని దూరం చేసి మనిషిలో నూతనోత్సాహాన్ని నింపగలిగే శక్తి నవ్వుకు ఉంది.

నవ్వులను వాటిలోని రకాలను, రహస్యాలను గురించిన వివరాల్లోకి వెళితే....

మనిషికి నవ్వు ప్రధానంగా రెండు సందర్భాల్లో వస్తుంది. అవి
ఒకటి : తాను కోరుకున్నది జరిగినప్పుడు
రెండు : అనుకోని అదృష్టం పలుకరించినప్పుడు.

తాను కోరుకోవడంలో మళ్లీ రెండు రకాలున్నాయి.
ఇందులో మొదటిది తనకు మేలు జరగాలని కోరుకోవడమైతే, రెండవది తన శత్రువుకు నష్టం జరగాలని కోరుకోవడం. తాను కోరుకున్నది జరిగినప్పుడు, అనుకోని అదృష్టం అకస్మాత్తుగా తన ఇంటి తలుపు తట్టినప్పుడు ఎవరికైనా మనసు ఆనందంతో ఉప్పొంగిపోవడం సహజం.

మనసులోని సంతోషమే మొహంపై నవ్వులుగా విరబూస్తుంది. వింత చేష్టల్ని, వికృతాకారాల్ని చూచినప్పడు, ఆసక్తికరమైన, అనూహ్యమైన విషయాలను గురించి విన్నప్పడు కూడా మనకు నవ్వు వస్తుంది.

మనిషికి నవ్వును తెప్పించడంలో పలు విషయాలు, సంఘటనలు దోహదపడతాయి. అందుకే కాబోలు నవ్వులు పలు విధాలుగా ఉంటాయి. శాస్త్రీయ పరిశోధనల ఫలితంగా నవ్వుల్లో అరవైకిపైగా రకాలున్నాయని తేలింది.

మల్లెలు విరిసినట్లుగా, సన్నజాజులు కురిసినట్లుగా సంపెంగలు మురిసినట్లుగా కొందరు నవ్వితే, తెలిమంచు తెమ్మెరలు పరచినట్లుగా, పాలనురుగులు పొరలినట్లుగా మరికొందరు నవ్వుతారు. రైళ్ళు ఆగిపోయినట్లుగా, లారీహారన్ మారుమ్రోగినట్లుగా నవ్వేవాళ్లు కొందరైతే, గుర్రాల సకిలింపును గుర్తుకు తెచ్చేలా, డబ్బాలో గులకరాళ్లు పోసిలోపుతున్నారనిపించేటట్లుగా నవ్వే మహానుభావులు కొందరు. తమ తమ నవ్వుల్లోని పోలికల కారణంగా ఏ ఇరువురైనా స్నేహితులయ్యే అవకాశాలను కొట్టిపారేయలేం.

నవ్వుల్లోని భేదాలకు కారణం నవ్వేవాళ్ల పూర్వజన్మ సంస్కారమే తప్ప వేరుకాదు. మానవుడు సంస్కారోపేతుడయ్యే కొద్దీ మందహాసవదనారవిందుడౌతాడు. చిరునవ్వు ఉత్తములకు ఆభరణమైతే, వెకిలినవ్వు, అట్టహాసం వంటివి అధములను అంటిపెట్టుకొనుంటాయి. వ్యక్తుల వ్యక్తిత్వాలకు దర్పణాలై నిలిచే ఈ నవ్వులు ఒక విధంగా ఆయా వ్యక్తుల స్థాయి, స్థానాలను సూచిస్తాయి కూడా.

ఒకాయన కష్టసాధ్యమైన పనిని తలకెత్తుకున్నాడు. 'గోఏహెడ్' అని ఎంతమందైతే ప్రోత్సహించారో వద్దని దాదాపు అంతమందీ వారించారు. అయినా సరే మనవాడు ముందుకే అడుగేశాడు. ప్రారంభంలో అంతా బాగానే ఉన్నప్పటికినీ లక్ష్యాన్ని చేరుకునే క్రమంలో అనేకానేక ఆటంకాలెదురయ్యాయి. గో ఏ హెడ్ అని ప్రోత్సహించిన వాళ్లెవరూ మళ్లీ కనిపించలేదు. కానీ వద్దని వారించిన వాళ్లు మాత్రం అడుగడుగునా ఎదురయ్యారు. అవహేళనల పిడిబాకుల్ని అదే పనిగా విసరివేశారు. అయినా కూడా మనవాడు తట్టుకొని నిలబడ్డాడు. ఒకానొక శుభ ముహూర్తంలో గెలుపుజండాను ఎగరేశాడు. అవధులు లేని ఆనందాన్ని పొందాడు. ఆ ఆనందమంతా నవ్వులుగా వెల్లి విరిసింది. ఆ నవ్వుల నిండా ఆత్మ విశ్వాసం తొణికిసలాడింది. ఆ నవ్వులు ఉత్తమ శ్రేణికి చెందినవి.

మరొకాయన సంగతి చూద్దాం. ( వేరే ఉద్దేశ్యంతో అనడంలేదు సుమా!)

ఈయన ఒకరోజు ప్రొద్దున లేవగానే తన భార్యను పిలిచాడు. "ఇంత ప్రొద్దున్నే తనతో పనేమిటబ్బా" అనుకుంటూ వచ్చిన ఆమెతో 'ఏమేవ్ ఈ వేళ నేతిగారెలు వండు'మని ఇతగాడు ఆనందంగా నవ్వుతూ చెప్పాడు. పెళ్ళైనప్పటినుండీ ఈయనలో ఇంతటి సంతోషాన్ని చూసినట్లుగా గుర్తులేని ఆవిడ ఉండబట్టలేకపోయింది. ఈ సంతోషానికి కారణమేమిటని అడిగింది. అంతే! నవ్వుతున్న నవ్వును ఆపి ఇతగాడు చెప్పిన జవాబు విని కొయ్యబారిపోయింది.

ఇంతకూ ఈ మహానుభావుడేం చెప్పాడయ్యా అంటే?

'రాత్రి ఎదురింట్లో దొంగలు పడి మొత్తం దోచుకెళ్లారట' అని. తమకు జరిగే లాభం కంటే, ఎదుటివాళ్లకు జరిగే నష్టానికే ఎక్కువగా సంతోషించే ఈ తరహా మనుష్యులవల్లనే కొంతమందికి నవ్వులంటే వెగటు పుట్టి ఉంటుంది.

ఎవరు ఏ విధంగా నవ్వినా, ఆ నవ్వులకు కారణాలు ఏవైనా నవ్వు మనిషి జీవితంలో ఒక భాగం అనే విషయాన్ని ఎవరూ కాదనలేరు. కొందరు తేలికగానే నవ్వుతారు. కొందరిని కాస్తంత ప్రయత్నం మీద నవ్వించవచ్చు. కొందరిని నవ్వించాలంటే తలక్రిందులుగా తపస్సు చేయవలసిరావచ్చు.

" నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు" అన్నాడు కృష్ణశాస్త్రి. సిగ్గుపడేటట్లుగా నవ్వేవాళ్లేకాదు సిగ్గుపడుతూ నవ్వేవాళ్లు కూడా ఉన్నారు. సిగ్గువిడిచి నవ్వేవాళ్ళ గురించి వేరే చెప్పనక్కరలేదు కదా!

భయపెట్టే విధంగా నవ్వేవాళ్లుండడం చేతకాబోలు నవ్వులంటే భయపడేవాళ్లు కూడా ఉన్నారు. 'నవ్వు నవ్వించు, కానీ నవ్వులపాలు గాకు' అని ఒక సూక్తి. నవ్వుతూ, నవ్వించడానికి, నవ్వుల పాలు కావడానికీ మధ్య చాలా దూరమే ఉన్నా నవ్వులు శృతిమించితే గతి తప్పితే ఆ దూరం దగ్గరౌతుంది మరి.

నవ్వు కొందరికి ఆహారమౌతుంది. కొందరికి అలంకారమవుతుంది. కొందరు నవ్వుల కుబేరులుంటారు. అదే పనిగా నవ్వుల్ని లోకం మీదకు రువ్వుతూ ఈ లోకాన్ని నవ్వులమయం చేయాలని ఆరాటపడుతుంటారు మరికొందరుంటారు, మనస్ఫూర్తిగా నవ్వలేనివాళ్లు. నవ్వేవాళ్లను చూసి ఓర్వలేని వాళ్లు వీళ్లు కూడా నవ్వుల్ని పంచుతారని చెప్పడం కంటే పెద్ద అబద్ధం మరొకటుండదు.

తాము నవ్వకపోతే లోకం తమను చూసి నవ్వే ప్రమాదముందని భావించిన కారణంగానే కొందరు (తమను చూసి నవ్వే అవకాశం లోకానికి ఇవ్వకూడదన్న స్థిర నిశ్చయంతో) నవ్వుల్ని నటిస్తూ బ్రతికేస్తుంటారు. వీళ్లు నవ్వే నవ్వులనే 'కృత్రిమమైన నవ్వు'లుగా చెప్పకోవచ్చు. కాగా తాము నవ్వితే లోకం తమను చూసి ఏడుస్తుందని భావించిన మరి కొందరు చాటుమాటుగా నవ్వుకుంటుంటారు. వీళ్లవి 'చాటుమాటు నవ్వులు'.

నవ్వితే నోటి ముత్యాలు రాలుతాయని భయపడేవాళ్లున్నారు. వీళ్లకూ, అమ్మాయిల్ని చూసి వెకిలిగా నవ్వి ముత్యాల్లాంటి తమ పళ్లను రాలగొట్టించుకున్న వాళ్లకూ, ఏ విధమైన సంబంధమూ లేదు సుమా!

కొన్ని నవ్వులు ప్రశ్నిస్తాయి. మరికొన్ని సమాధానం చెబుతాయి. కొన్ని నవ్వులు పలకరింపులైతే, ఇంకొన్ని వెక్కిరింపులౌతాయి. కొన్ని నవ్వులు మనసుల్ని గెలుచుకుంటాయి మరికొన్ని మతిని పోగొడతాయి. కొన్ని నవ్వులు చలాకీగా ఉంటే కొన్ని జీవం లేకుండా ఉంటాయి. చిరునవ్వులు, చిలిపి నవ్వులు, సిరుల్ని కుమ్మరించే నవ్వులు, మొగమాటపు నవ్వులు, దరిద్రపు గొట్టు నవ్వులు విషాదాన్ని నింపుకున్న నవ్వులు, విషాన్ని వెదజల్లే నవ్వులు వేరు వేరుగా ఉంటాయి.

నవ్వుతూ నవ్వుతూ ప్రాణాలు తీసే ప్రబుద్ధులున్నట్లుగానే గుట్టుచప్పడు కాకుండా గుంభనంగా నవ్వి తమ కార్యం గట్టెక్కించుకునే వాళ్లూ ఉన్నారు. గుట్టురట్టయ్యేలా నవ్వి ఆనక గుడ్లు తేలవేసే వాళ్లు ఒక రకం. ఏడవలేక నవ్వేవాళ్లు మరో రకం. కాగా నవ్వును, ఏడుపును కలగలిపి నవ్వుతున్నదీ, ఏడుస్తున్నదీ తెలియకుండా నవ్వే / ఏడ్చే వాళ్లు ఇంకో రకం.

నవ్వడానికి, నవ్వకుండా ఉండడానికి వేరు వేరు సందర్భాలున్నాయి. ఆయా సందర్భాలలో అలా ప్రవర్తిస్తేనే బాగుంటుంది. తద్భిన్నంగా ప్రవర్తిస్తే అంతా తల్లక్రిందులౌతుంది. 1. మహారాజుల సమక్షంలో ఉన్నప్పుడు, 2. జరిగిన విషాదం పట్ల అందరు చింతాక్రాంతులై ఉన్న సమయంలోనూ, 3. ఎదుటి మనిషికి అవమానం జరిగిన సందర్భంలోనూ, 4. తానొక్కడే దారి వెంట నడుచుకుంటు వెళుతున్న సమయంలోనూ నవ్వడం అసమంజసంగా, అసందర్భంగా ఉంటుంది. (నవ్వు నాలుగు విధాలుగా చేటు) అసందర్భమైన నవ్వు అనేక అనర్థాలకు మూలకారణమౌతుంది.

☆ఉదాహరణకు:-

శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవం మహావైభవంగా జరిగిన మరునిమిషంలో అనూహ్యంగా లక్ష్మణస్వామి నవ్విన నవ్వు ( మహారాజుల సమక్షంలో ఉన్నప్పడు) అనేకానేక అపార్థాలకు దారి తీసిన విషయం మీకందరకు తెలిసిందే కదా! ఒక రకంగా లక్ష్మణస్వామి నవ్వును అసందర్భమైన నవ్వు గానే పేర్కొనవచ్చు.

మరో ఉదాహరణ:-

మయసభలోని వింతలను విశేషాలను తిలకిస్తూ జారిపడిన దుర్యోధనున్ని చూసి ద్రౌపది నవ్విన నవ్వు (ఎదుటిమనిషికి అవమానం జరిగినప్పుడు) కూడా అసందర్భపు నవ్వే. ఆ నవ్వు ఆమెకు, పాండవులకు అనేకానేక కష్టాలను తెచ్చిపెట్టిన విషయం మీకు తెలిసిందే కాగా,

సందర్భోచితమైన నవ్వుకు ఒక ఉదాహరణ చూద్దాం.

సమయపాలనను పాటించడంలో యమధర్మరాజును మించినవాళ్లు లేరనే విషయం జగద్విదితం. కాగా తన విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించే క్రమంలో.... ఆయన సత్యవంతుని ప్రాణాలను గైకొనిపోతున్న సమయంలో.....దీనంగా ఆయన వెంటపడింది సావిత్రి. ఆమె వేదనకు, కన్నీటి ప్రార్థనకు కరిగిపోయిన యమధర్మరాజు ఆమెకు ఒక వరాన్నిచ్చాడు.....రెండవ వరాన్ని ప్రసాదించాడు.......మూడవ వరాన్ని అనుగ్రహించాడు. అంతే!

అప్పటిదాక దీనవదనయైన సావిత్రి తన వేదనకు వీడ్కోలు పలుకుతూ ఒక్క నవ్వు నవ్వింది. యమధర్మరాజు ఓటమిని, తన గెలుపును సూచించే నవ్వు. అంత ధైర్యంగా, నిర్భయంగా నవ్వి కూడా సావిత్రి ఇసుమంతైనా నష్టపోకపోవడానికి కారణం సావిత్రిది సందర్భాన్ని గమనించి నవ్విన నవ్వు కావడమే.

అందువలన

ఎంతటి నవ్వైనా సందర్భాన్ననుసరించి ఉన్నప్పడే రక్తికడుతుంది. రాణిస్తుంది. సమయాన్ని,సందర్భాన్ని గమనించకుండా నవ్వకూడదని చెప్పడానికే 'నవ్వు నాలుగు విధాలుగా చేటు' అన్నారు. అయితే 'నలభైనాలుగు విధాలుగా గ్రేటు' అని వేరే చెప్పనక్కరలేదనుకుంటాను. ఎటుంచీ ఆ విధాలనెరిగి నవ్వడమే వివేకవంతుని లక్షణం మరి.

చివరగా

'నవ్వించడం ఒక యోగం నవ్వడం ఒక భోగం నవ్వలేకపోవడం ఒక రోగం

అన్నారు విజ్ఞులు. అందువల్ల ప్రతి మనిషి ఒక యోగిలా బ్రతకడానికి ప్రయత్నించాలి. ఆ అదృష్టం దక్కకపోతే నిరాశ చెందకుండా భోగిలా బ్రతకడానికి యత్నించాలి. రోగిలా బ్రతకడం నేరమని నేను చెప్పబోతున్నట్లుగా మీకీపాటికి అర్థమయ్యే ఉంటుంది కాబట్టి నేను మళ్లీ ప్రత్యేకంగా చెప్పడం లేదు.

ఏది ఏమైనా

నిండుగా, నిష్కల్మషంగా, హాయిగా, మనస్ఫూర్తిగా నవ్వగలిగేవాళ్లకంటే అదృష్టవంతులు ఈ భూ ప్రపంచం మొత్తమ్మీదలేరని, ఉండబోరని ఇందు వెంట తమకు మనవి చేస్తున్నాను.



# స్నేహానికన్న మిన్న...

మనిషిలోని భావవ్యక్తీకరణకు అత్యుత్తమ సాధనం మాట. మాట కాకుండా చేష్టల (చేతలు, చూపులు, సైగలు మొ॥వి) ద్వారా కూడా మనిషి తన అంతరంగంలోని భావాలను వ్యక్తం చేయగలడు. అయితే ముందే చెప్పుకున్నట్లుగా మాటే అత్యుత్తమ సాధనం. మాట ఒక విధమైన శబ్ధం. ఆ శబ్ధానికి భావ సమన్వయం తోడైనప్పుడు ఒక అర్ధం ఏర్పడుతుంది. అర్ధవంతమైన శబ్దాల సమూహమే భాషగా రూపొందుతుంది. ఉచ్ఛారణలోని వైవిధ్యం, మానవజాతుల్లోని రకాలు, నైసర్గిక, భౌగోళిక స్థితిగతుల ఫలితంగా కాలక్రమాన వివిధ భాషలు ఏర్పడ్డాయి. వివిధ కాలాల్లో, ప్రాంతాల్లో, వివిధ రకాలుగా ఏర్పడినప్పటికినీ అన్ని భాషల పరమార్ధం మనిషి అంతరంగావిష్కరణే అంటే అతిశయోక్తి కాదు.

ఒక మనిషి తన భావ వ్యక్తీకరణకు ఒక భాషలోని ఏ శబ్ధాలనైతే వాడాడో వాటిని విన్న వ్యక్తి ఆ భాషను గురించి ఆ భాషలోని ఆ శబ్ధాలకున్న సామాన్య, విశేష అర్ధాలను గురించి కూడా తెలిసిఉండాలి. అంటే భాషతో పాటుగా భావసమన్వయం కూడా తప్పకుండా కుదరాలన్నమాట. అలా కుదిరినప్పడే ఒకరి భావాలు రెండవవారికి అర్ధమౌతాయి. అర్ధం కాని స్థితి అనర్ధానికి దారితీస్తుంది. అయితే సమయాన్ని సందర్భాన్ని , ఉచ్ఛరించే తీరును బట్టి కూడా ఆయా భాషల్లోని శబ్ధాలకుండే అర్ధాలు మారుతుంటాయి.

మాట్లాడే వ్యక్తికి, వినే వ్యక్తికి మధ్యన సరియైన అవగాహన చాలా అవసరం. ఈ అవగాహన చక్కగా కుదిరినప్పడు ఇరువురు వ్యక్తులు ఎంతసేపైనా మాట్లాడుకోగలుగుతారు. స్పందన, ప్రతిస్పందనల మధ్యగల సమన్వయం ఒకరి భావాలను, అభిప్రాయాలను మరొకరు తెలుసుకోవడానికి తమ భావాలను అభిప్రాయాలను స్పష్టంగా తెలియజేయడానికి అవకాశాన్ని కల్పిస్తుంది. తమ అభిప్రాయాలు, భావాల మధ్యన గల సారూప్యం వాళ్లను పరస్పరం దగ్గర చేస్తుంది. ఈ దగ్గరి తనాన్ని సఖ్యతగా పేర్కొనవచ్చు.

" సమాన శీల వ్యసనేషు సఖ్యం" అని ఆర్యోక్తి అనగా సమానమైన (ఒకే విధమైన) ఆలోచనలు, అభిప్రాయాలు, ఇష్టా,యిష్టాలు (స్వభావం) ఉంటే సఖ్యత ఏర్పడుతుందని భావం. ఈ సఖ్యత కారణంగా ఒకరంటే ఒకరికి అభిమానం ఏర్పడుతుంది. ఇది మొదటిదశ. ఈ దశలో ఏర్పడ్డ అభిమానమే స్నేహమనే సౌధానికి పునాదిగా నిలుస్తుంది. తర్వాత దశలో ఒకరి అభిప్రాయాలను, ఇష్టాయిష్టాలను గౌరవించడానికి, సమర్ధించడానికి, మరొకరు పూనుకుంటారు. ఇది స్నేహమనే

సౌధానికి ఉపరితల నిర్మాణం వంటిది. మూడవ దశలో ఎదుటి వ్యక్తిపై ఏర్పడ్డప్రేమ, నమ్మకాల ఫలితంగా తమ అభిప్రాయాలను, ఇష్టాయిష్టాలను మార్చుకోవడం, వదులుకోవడం కనిపిస్తుంది. ఇది స్నేహమనే సౌధ నిర్మాణంలో పై కప్పను నిర్మించే దశగా చెప్పకోవచ్చు.

ఇక చివరిదైన, రంగులు వేసి, మెరుగులు దిద్ది మెరిపించే దశగా ఒకరికోసం ఒకరు తమ సర్వస్వాన్ని ధారపోయడాన్ని చెప్పకోవచ్చు. ఈ నాలుగు దశల్లోను ఇరువురు వ్యక్తుల మధ్యనగల స్నేహం పరిశీలించబడుతుంది. పరీక్షింపబడుతుంది. ఈ నాలుగు దశలను విజయవంతంగా దాటినప్పడు అది చిరకాల స్నేహమౌతుంది " స్నేహమంటే రెండు శరీరాల్లో ఉండే ఒక్కఆత్మ " అన్న అరిస్టాటిల్ మాటలకు చక్కని సాక్ష్యమౌతుంది.

స్నేహనికి 'నెయ్యం' అనే పేరుంది. ఈ పేరు వెనకాల ఒక ఆసక్తికరమైన కథ ఉంది. అదేమిటంటే పాలను తోడు పెడితే పెరుగు ఏర్పడుతుంది. పెరుగును చిలికితే వెన్న పుడుతుంది. వెన్నను కాచితే నెయ్యి తయారవుతుందనే విషయం అందరికీ తెలిసిందే. ఇక్కడ గమనించవలసిన విషయమేమిటంటే నెయ్యి అనేది ప్రాథమిక రూపం కాదు. పాలు కొన్ని దశల్ని విజయవంతంగా దాటినప్పడే నెయ్యి ఏర్పడుతుంది. స్నేహం కూడా అంతే. ఇరువురి మధ్యనగల పరిచయం పరస్పరం ప్రేమాభిమానాలు, నమ్మకం, త్యాగనిరతి వంటి దశల్ని విజయవంతంగా దాటినప్పడే నిజమైన స్నేహం ఏర్పడుతుంది. ఈ కారణం చేతనే స్నేహాన్ని 'నెయ్యం' అని పేర్కొన్నారు.

సమాజంలో ప్రతి వ్యక్తికి తనవైన ఆలోచనలు, అభిప్రాయాలు, ఇష్టాయిష్టాలు ఉంటాయి. ఏ ఇరువురి ఆలోచనలు కానీ, అభిప్రాయాలు కానీ, ఇష్టాయిష్టాలు కానీ కలవడమే స్నేహం అని స్థూలంగా చెప్పకోవచ్చు. కలవకపోవడం వల్ల నష్టం లేదు కానీ పరస్పరం వ్యతిరేకించుకోవడం వల్ల ఘర్షణ పుడుతుంది. ఒకరు అవునంటే రెండవవారు కాదనడమే శత్రుత్వానికి మూలమౌతుంది. ఒకరితో ఒకరు ఏ మేరకు ఏకీభవిస్తున్నారన్న దానిపైన స్నేహం ఆధారపడి ఉన్నట్లుగానే, ఏమేరకు వ్యతిరేకిస్తున్నారన్న దానిపైన శత్రుత్వం ఆధారపడి ఉంటుంది.

స్నేహితుడు, సఖుడు, నేస్తగాడు, చెలువుడు చెలికాడు, మిత్రుడు, సంగాతకాడు, సహచరుడు, సన్నిహితుడు అని పలురకాల పేర్లతో పిలువబడే వ్యక్తి కొంచెం, ఇంచు మించుగా మనలాంటి అభిప్రాయాలనే కలిగిఉన్నాడన్నమాట. మనం స్పందించే సమస్యలపైనే స్పందించే లక్షణం ఉన్నవాడన్నమాట. అయితే ఏ మాట కామాటే చెప్పకోవాల్సివస్తే స్నేహం అనేది కేవలం ఆలోచనలు, అభిప్రాయాలు కలిసినంతమాత్రాన్నే కుదరదనే చెప్పకోవాలి.

స్నేహన్ని బలోపేతం చేయడంలో భౌగోళిక, చారిత్రక, జాతి, కుల, మత, వర్గ, వర్ణ సంబంధ కారణాలు కూడా తగినంత ప్రభావాన్ని చూపిస్తాయి. ఇవేవీ పట్టించుకోకుండా ఏర్పడే స్నేహం సృష్టిలోకెల్లా అత్యంత గొప్పది. విశిష్టమైనదని చెప్పవచ్చు. అయితే అలాంటి స్నేహం కుదరడం చాలా అరుదు.

'ద్రవత్వము వలన సర్వలోహములును నిమిత్తము వలన మృగ, పక్షులును, భయ, లోభముల వలన మూర్ఖులును కలుసుకొని స్నేహితులైతే, కేవల దర్శన మాత్రముననే సజ్జనులు స్నేహితులవుతారని' పంచతంత్రంలోని మిత్రలాభం వల్ల తెలుస్తుంది.

" నీలోని సుగుణాలతో పాటుగా, నీ బలహీనతలను కూడా ప్రేమించగలిగిన వాడే నిజమైన స్నేహితుడు " అన్న మాటల్లో ఎంతో నిజముంది. స్నేహితుడంటే కలిమిలో కలిసి వచ్చి, లేమిలో విడిచి వెళ్లిపోయేవాడు కాదు. 'ఆపద సమయాల్లో అండగా నిలిచే వాడే అసలైన మిత్రుడు అంటారు.

తన సుభాషిత రత్నావళిలో ఏనుగు లక్ష్మణకవి మితున్రి లక్షణాలను తెలియజేస్తూ

" అఘము వలన మరల్చు హితార్థ కలితు<br>
జేయు గోప్యంబు దాచు బోషించు గుణము<br>
విడువ డాపన్ను లేవడి వేళ నిచ్చు<br>
మిత్రుడీలక్షణంబుల మెలగుచుండు " అంటాడు.

మనమేదైనా తప్పపని చేయబూనుకున్నప్పడు వద్దని వారించడం, అన్ని వేళల్లోనూ మన మేలును కోరడం మనకు సంబంధించిన రహస్యాలను దాచడం. ఆపద సమయాల్లో ఆదుకోవడం వంటి గుణాలను మన పట్ల కనబరచేవాడే నిజమైన మిత్రుడని కవిగారు సూటిగానే తెలియజేశాడు. ఈ లక్షణాలన్నీ ఉన్న మిత్రుడు ఎవరికైనా ఉన్నాడా? అన్న సందేహం మీకక్కరలేదు. 'లక్ష్మణ' కవి పేర్కొన్న లక్షణాలన్నీ సంపూర్ణంగా కలిగి ఉన్న మిత్రుడు సుగ్రీవునికున్నాడు. ఆయనే శ్రీరామ చంద్రుడు.

తప్పలు చేయకుండా సుగ్రీవున్ని నివారించడంలోను, అన్ని వేళల్లో అతని మేలును కోరడంలోను, అతని రహస్యాలను దాచడంలోను, కష్టాల్లో అండగా నిలువడం లోను రామచంద్రుడు ఎంతో శ్రద్ధవహించాడు. శ్రీరాముని వంటి మిత్రున్ని పొందగలిగిన సుగ్రీవుడు ఎంతో అదృష్టవంతుడు అని చెప్పవచ్చు. అయితే రామ చంద్రునితో మైత్రి చేయగల అర్హతలన్నీ తనకున్నాయని సుగ్రీవుడు తన ప్రవర్తన ద్వారా నిరూపించుకున్నాడు.

మహాభారతంలోని కర్ణ, సుయోధనుల మైత్రి విషయం ఈ సందర్భంగా ప్రస్తావనార్హం. తన అర్హత ప్రశ్నింపబడుతూ,స్థితి ఎత్తి చూపించబడుతున్న తరుణంలో చేష్టలుగిడి, నిస్సహాయుడై నిలబడ్డ కర్ణునికి తాను అంగరాజ్య పట్టం కట్టడం ద్వారా సుయోధనుడు స్నేహ హస్తాన్నందించాడు. రారాజు హస్తాన్నందుకున్న కర్ణుడు అటు తర్వాత ఎన్ని కష్టాలెదురైనా ఆ మైత్రీ బంధాన్నీ కొనసాగించి తన ఔన్నత్యాన్ని చాటుకున్నాడు. కర్ణ, సుయోధనులవి ఆదర్శవంతమైన జీవితాలు కాకపోయినా వాళ్లస్నేహం ఆదర్శవంతమైనదిగా పరిగణింపబడడం గమనార్హం.

స్నేహం మనిషి మనసులో మమతల్ని నింపుతుంది. మనసులోని మమతే మనిషిని ప్రశాంత చిత్తున్ని చేస్తుంది. ప్రశాంత చిత్తం మనిషి స్థితప్రజ్ఞుడుగా ఎదగడానికి దోహదపడుతుంది. స్థితప్రజ్ఞునిగా ఎదిగిన మనిషి మనీషిగా గౌరవింపబడతాడు. మనిషి మనీషిగా ఎదిగేక్రమంలో స్నేహం మొదటి మెట్టన్న మాట స్నేహం మనిషి జీవితానికొక నిండుదనాన్నిస్తుంది. నిండైన జీవితాన్ని గడిపిన వ్యక్తి చరితార్థుడౌతాడు. గుండెకు నిబ్బరాన్ని, మొక్కవోని ధైర్యాన్ని ప్రసాదించడం ద్వారా స్నేహం జీవనపోరాటంలో మనిషి ఓటమిబారిన పడకుండా రక్షిస్తుంది. అయితే ఇవన్నీ కూడా మంచివానితో లభించిన స్నేహం వల్ల మాత్రమే సాధ్యమౌతాయన్న విషయాన్ని ఈ సందర్భంగా గుర్తుంచుకోవడం చాలా అవసరం. " మంచి స్నేహితులు లేని వాళ్లే జీవితంలో ఓడిపోతారు. ఒక్క మంచి స్నేహితుడున్నాచాలు అతన్నెవరూ ఓడించలేరు.' ' అన్న అబ్రహాంలింకన్ మాటలే ఇందుకు చక్కని ఉదాహరణ.

☆ మళ్లీ ఒకసారి మన పురాణాల్లోకి వెళదాం.

చిరిగిన వస్త్రములు కలవాడు కావడం చేత 'కుచేలుడు'గా పిలువబడ్డాడు సుధాముడు. చాలా మందికి లాగే సుధాముడికీ జీవితం నిత్యపోరాటం అయితే సుధాముడు జీవన పోరాటంలో ఓడిపోలేదు. అందుక్కారణం అతనికి శ్రీ కృష్ణుని వంటి మిత్రుడుండడమే. శ్రీ కృష్ణుడు భాగ్యవంతుడు సుధాముడు పేదవాడు అయినా కూడా చిన్ననాటి స్నేహం వాళ్లను కలిపే ఉంచింది. వాళ్లిద్దరిలో ఏ దుర్గుణాలు ( ముఖ్యంగా అరిషడ్వర్గాలు) లేకపోవడమే అందుక్కారణం. పేదవాడైన సుధామున్ని ఆదరించి అవసరమైన ధనాన్ని అనుగ్రహించి(పోషించుగుణము) అతని పేదరికాన్ని పోగొట్టడం ద్వారా మిత్రుని పట్ల తన మిత్రధర్మాన్ని చక్కగా నిర్వర్తించాడు శ్రీ కృష్ణుడు. "కృష్ణ సుధాముల మైత్రి లోకానికి ఆదర్శం" అంటే అతిశయోక్తి కాదు.

ద్రోణుడు పేదబ్రాహ్మణ బాలుడు ద్రుపదుడు సంపన్న క్షత్రియ పుత్రుడు. వాళ్లిద్దరూ బాల్యంలో ( ఏ బేషజాలు తెలియని దశ) సహధ్యాయులు ప్రాణమిత్రులు పెరిగి పెద్ద వాళ్లయ్యాక అహంకారం, మాత్సర్యాదుల వంటి దుర్గుణాలను ఒంటపట్టించుకొని పరస్పరం శత్రువులైనారు. ఒకరినొకరు అవమానించుకున్నారు. ద్వేషించుకున్నారు. తమ జీవితాల్లో అశాంతిని నింపుకున్నారు. స్నేహితుని పట్ల ధర్మాన్ని తప్పి వ్యవహరించే వాళ్ల జీవితాలెలా ఒడుదొడుకుల పాలౌతాయో తెలుసుకోవడానికి వీళ్ల కథ మంచి ఉదాహరణగా నిలుస్తుంది.

సభ్యసమాజంలో మనిషిస్థాయిని నిర్ణయించే కీలకాంశాలలో అతనికి ఇతరులతోగల స్నేహం కూడా ఒకటౌతుంది. అతని కున్న స్నేహితులను బట్టే ఒక వ్యక్తి సమాజంలో గౌరవింపబడడం, గౌరవింపబడకపోవడం జరుగుతూ ఉంటుంది.

కొంచెపు నరసంగతిచే
అంచితముగకీడువచ్చు అదియెట్లన్నన్
కించుత్తునల్లి కుట్టిన
మంచమునకు పెట్టు వచ్చు మహిలో సుమతీ!

నల్లికి ఆశ్రయమిచ్చినందుకు మంచం దెబ్బల పాలౌతున్నట్లుగానే అల్పులతో స్నేహం చేస్తే ఆ,చేసిన వాళ్లకు కీడు తప్పదని నీతి అలాగే ఇనుముతో చెలిమి చేసినందుకే నిప్పకు సుత్తిదెబ్బలు తప్పవని అంటారు.

మంచి వాళ్లతో స్నేహం చెడ్డవాళ్లను మంచివాళ్లుగా మార్చితే, చెడ్డ వాళ్లతోస్నేహం మంచివాన్ని చెడుమార్గం పట్టిస్తుంది." నీ స్నేహితులెవరో చెబితే నీ వెలాంటి వాడివో చెబుతాను"న్న ఒకానొక లౌక్యం తెలిసిన పెద్దమనిషి మాటలను ఈ సమయంలో గుర్తు చేసుకోవడం అసందర్భం కాదు.

అనురాగం, ఆప్యాయత, అవగాహన, ఆలంబన అనే నాలుగు స్తంభాలపైన నిర్మింపబడిన అద్భుత, అపురూపగోపురం స్నేహం, అది శాశ్వతమైనట్టిది, నిత్యనూతనమైనట్టిది. అనునిత్యం స్వచ్ఛతా కాంతులతో మెరిసిపోతూ ఉంటుంది. అనుగారం, ఆప్యాయతలుండవలసిన చోట అవసరం దాగుండి. అవగాహన ఆలంబనలుండవలసినచోట అవకాశం పొంచి ఉంటే అది కృత్రిమ స్నేహమౌతుందనడంలో సందేహం లేదు. నమ్మినవారిని నిలువెల్లాముంచి పగలబడి నవ్వే నైజం కృత్రిమ స్నేహానికి పుట్టుకతో వచ్చిన గుణమని తరచుగా రుజువౌతూనే ఉంటుంది. ఒక చిన్న ఉదాహరణ చూద్దాం.

ఇద్దరు వ్యక్తులున్నారు. మొదటి వ్యక్తి అతడు రెండవవ్యక్తి ఆమె బస్టాపులోను, షాపింగ్ కాంప్లెక్స్ ముందర మూలమలుపు దగ్గర ఒకరినొకరు ఎదురు పడ్డారు. కావాలనో, కాకతాళీయంగానో తెలియదు. కానీ ఇలా మూడు, నాలుగుసార్లు జరిగింది. ఈక్రమంలో... ఒకరినొకరు గమనించుకున్నారు... చూపులతో పలకరించుకున్నారు... నవ్వులతో పరామర్శించుకున్నారు... పరస్పరం అభిమానించుకున్నారు.

' మనం మంచి స్నేహితులుగా ఉందాం ' అంటూ ఓ రోజున అతడు ఆమెతో మాటలు కలిపి స్నేహహస్తాన్నందించాడు. అతని మాటల్ని నమ్మి అమాయకంగా ఆ హస్తాన్నందుకున్నదామె, అలా మొగ్గతొడిగిన వాళ్ల స్నేహం మొదటి దశలో శుక్లపక్ష చంద్రునితో పోటీపడిపెరిగింది. ఆ స్నేహితులు రెండవదశలో ప్రేమికులయ్యారు. ప్రేమనే తింటూ, ప్రేమనే త్రాగుతూ, ప్రేమనే శ్వాసిస్తూ, ప్రేమలోకంలో ఆనందంగా విహరించారు. ఆ ప్రేమికుల అన్యోన్యతను చూసి, ఆశ్చర్యపోయిన ఒకానొక చిన్ని శిశువు అకస్మాత్తుగా ఆమె గర్భంలోకి అడుగుపెట్టడంతో మూడవ దశ ప్రారంభమయ్యింది. అన్యోన్యప్రేమికుల అనురాగానికి, ప్రతిరూపమైన ఆ చిన్ని శిశువు కూడా శుక్లపక్ష చంద్రునితో పోటీపడి పెరుగుతుండగా మూడవదశ పూర్తయ్యింది.

ఇక నాలుగవదశ అచ్చంగా మొదటిదశలో లాగే 'మనం మంచి స్నేహితులుగానే ఉందాం' అని అతడు రెండవ సారి అనడంతో ప్రారంభమయ్యింది. 'ఇది స్నేహం కాదు మోసం ద్రోహం, వంచన' అని ఆక్రోశించిందామె. ఆమె మాటలే నిజం కానీ అప్పటికే ఆలస్యమైపోయింది. అమృతం కాస్తా విషమైపోయింది. 'అరిటాకు-ముల్లు' కథలోని మామూలు నీతిని భారీమూల్యం చెల్లించి కొనుక్కున్న ఆమె అమాయకత్వం గురించి లోకం ఆసక్తిగా చెప్పుకోవడంతో నాలుగవ దశపూర్తయ్యింది.

" తగిన జాగ్రత్తలు తీసుకోకుండా, ఎవరెలాంటి వాళ్లో తెలుసుకోకుండా ఎవరితోనైనా స్నేహం చేయకూడద"న్న నీతిని ఈ లోకానికందిస్తూ ఆమె పై లోకానికి వెళ్లిపోయింది.

స్నేహం చేయడం ఒక కళ. అది అంత సులభంగా రాదు. మంచివాళ్లతో స్నేహం చేయడానికి, ఒకరికి మంచి స్నేహితునిగా మిగలడానికి అవసరమైన తెలివితేటలతో పాటుగా చిత్తశుద్ధితో కూడిన కృషి ఎంతగానో అవసరం. స్నేహం నమ్మకంపైన ఆధారపడి ఉంటుందనుకుంటే ఆ నమ్మకం నీలో ఉండాలి. స్నేహానికి నిస్వార్థం వన్నె తెస్తుందనుకుంటే స్వార్థాన్ని జయించిన హృదయం నీకుండాలి. స్నేహానికి త్యాగం చిరకీర్తిని ప్రసాదిస్తుందనుకుంటే ఆ త్యాగం చేయగల ధైర్యం నీకుండాలి. అప్పుడే నీవొక మంచి స్నేహితునివి కాగలుగుతావు. అంతేకాదు ఆ దృష్టితోనే పరిశీలించి చూసి ఎన్నుకున్నప్పుడే మంచి స్నేహితులను పొందగలుగుతావు.

" పది రూపాయలు చెల్లించి మంచి స్నేహాన్ని కొనుక్కోమ"న్నారు మన పెద్దవాళ్లు. అలాగే "పది రూపాయలు ఇచ్చైనా సరే చెడు స్నేహాన్ని వదిలించు కోమ" న్నారు. "పది రూపాయల గిట్టుబాటు లేకుండా ఏపనీ చేయవద్ద"న్న మన పెద్దవాళ్లే స్నేహం చేయడంలోకానీ, వదిలించుకోవడంలోకానీ నిన్నే "పది రూపాయలు ఖర్చుపెట్టు"మని అన్నారంటే స్నేహానికి వాళ్లెంత విలువిచ్చిందీ తెలుస్తుంది కదా! ఇతరుల అందాలను విమర్శించేముందు నీ అందమేపాటిదోననే విషయాన్ని ఒకసారి నిజాయితీగా అద్దంలో పరిశీలించి చూసుకోమన్నమాట, స్నేహానికి కూడా వర్తిస్తుంది. మంచి స్నేహితులు కావాలని కోరుకునే ముందు నీ వెంతమందికి మంచి స్నేహితునిగా ఉన్నావనే విషయాన్ని గురించి ఆలోచించు కోవడం ఎంతైనా అవసరం.

లోకంలో ఎవరు మంచివాళ్లో ఎవరు కాదోననే విషయాన్ని ఆయా వ్యక్తులతో స్నేహం ఏర్పడుతున్న దశలోనే గమనించవచ్చు. మంచి వానితో స్నేహం మధ్యాహ్నపుటెండలో నిలబడితే ఏర్పడే నీడలాగా మొదట చిన్నగా ప్రారంభమై సాయంకాలమౌతున్న కొద్దీ క్రమంగా పెరిగే నీడలాగా పెరిగితే, చెడ్డవానితో స్నేహం ప్రారంభంలోనే ఎంతో అట్టహాసంగా ఉదయం పూట ఎండలో నిలబడితే ఏర్పడే నీడలాగా మొదట పెద్దగా ప్రారంభమై క్రమంగా చిన్నదవుతూ మిట్ట మధ్యాహ్నానికి కాళ్లక్రిందికి చేరుకునే నీడలాగా తగ్గిపోతుంది.

అందుచేత,

పరిచయంగా ప్రారంభమై క్రమంగా పెరుగుతున్న చెలిమిపట్ల శ్రద్ధవహిస్తూ, అట్టహాసంగా ప్రారంభమైన స్నేహాన్ని మొగ్గదశలోనే త్రుంచివేసుకుంటూ ముందుకు సాగిపోయే వ్యక్తి మంచిస్నేహితులను సంపాదించు కోవడమే కాకుండా మరొకరికి మంచి స్నేహతునిగా నిలుస్తాడని కూడా చెప్పవచ్చు.

వ్యవహారం చేతనే మిత్రులుకానీ, శత్రువులు కానీ ఏర్పడుతుంటారని విజ్ఞులు ఏనాడో సెలవిచ్చారు. అందువల్ల మంచి మిత్రులను పొందగలిగేలా వ్యవహరించడం మనిషికి ఎంత అవసరమో, తన ప్రవర్తన వలన శత్రువులు ఏర్పడకుండా చూసుకోవడం కూడా అంతే అవసరం.

ఏది ఏమైనా

సత్యం పట్ల, ధర్మంపట్ల విశ్వాసంతో, సమాజంపట్ల పరిపూర్ణమైన అవగాహనతో మంచి చెడు పట్ల విచక్షణతో, నిజాయితీగా ఋజుమార్గంలో ఎవరైతే వ్యవహరిస్తారో వాళ్లు మాత్రమే స్నేహప్రపంచంలో విజయకేతనాన్ని ఎగురవేస్తారు.



# కోపి- అల్పాయువు

తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!

అంటూ సుమతీ శతకంలో భద్ర భూపాలుడు కోపాన్ని మనిషికి శత్రువుగా పేర్కొన్నాడు. మనిషికి అంతశ్శత్రువులనదగిన అరిషడ్వర్గాలలో కోపం (క్రోధం) కూడా ఒకటి. మనిషి పతనానికి కోపం దగ్గరిదారి. కోపాన్ని జయించిన వానికంటే గొప్పవాడు ఎప్పుడూ, ఎక్కడా లేడు, ఉండబోడు అంటే అతిశయోక్తి కాదు.

అసలు కోపం అంటే ఏమిటి? ఏ మనిషికైనా కోపం ఎందుకు వస్తుంది? ఎప్పుడు వస్తుంది? ఎలా వస్తుంది? దాని పరిణామాలు నష్టపూరితంగానే ఎందుకుంటాయి? అనే విషయాలను పరిశీలిద్దాం.

మనిషి తన మనసులోని భావాన్ని మాటల సహాయంతో ఆవిష్కరిస్తాడు. ఆ మాటల్ని విన్న ఎదుటి మనిషి అందులోని భావాన్ని అర్థం చేసుకొని తన ప్రతిస్పందన ఏమిటో తెలియజేస్తాడు. ఇలా మొదటి వ్యక్తి స్పందనకు రెండవ వ్యక్తి ప్రతిస్పందనకు సరియైన సమన్వయం కుదిరినప్పుడు విషయ అవగాహన జరిగి సమస్య పరిష్కరింపబడుతుంది. సరియైన సమన్వయం కుదరనప్పుడు అభిప్రాయభేదం ఏర్పడుతుంది. ఫలితంగా ఇరువురి మధ్యా ఘర్షణ పుడుతుంది. సమస్యాప్రాముఖ్యత, అభిప్రాయంలోని భేద తీవ్రత ఘర్షణను భావం నుండి భాషకు, భాషనుండి క్రియ.... ప్రతిక్రియల వరకు తీసుకువెళతాయి.

ఇరువురు వ్యక్తుల మధ్య అభిప్రాయభేదం ఏర్పడి అది ఘర్షణ నుండి... ప్రతిక్రియల వరకూ దారితీసిన స్థితిలో ఒకరి అభిప్రాయాన్ని రెండవవారు సరిగ్గా అర్థం చేసుకోలేక పోవడం కానీ, అంగీకరించలేక పోవడం కానీ కావచ్చు. ఒక్కొక్కసారి రెండూ కారణం కావచ్చు. ఎదుటి మనిషికి అర్థమయ్యేలా కానీ, అతడు అంగీకరించేలా కానీ తన అభిప్రాయాన్ని చెప్పడంలో ఒక మనిషి విఫలమైనప్పుడు కూడా ఘర్షణ తలెత్తే అవకాశం ఉంది. ఒకరు ఆశించిన విధంగా రెండవ వారి మాటతీరు, ప్రవర్తన, భావవ్యక్తీకరణ, ప్రతిస్పందనాదులు లేకపోయినప్పుడు కోపం పుట్టడానికి ఆస్కారం ఉంది. తను ఊహించని, తనకు నచ్చని భావాలను వినవలసిరావడం, అంగీకరించవలసి రావడం వల్ల మనిషి కోపానికి గురయ్యే అవకాశాలు హెచ్చుగా ఉన్నాయి.

'కోపం', 'ఆగ్రహం', 'ఆవేశం', 'బుసలుకొట్టడం', 'ధూంధాంలాడడం' అనేవి మనిషి అంతరంగం వ్యక్తీకరించే అసంతృప్తికి పలుపేర్లు. భావవ్యక్తీకరణలో మెదడు ప్రధానపాత్ర వహిస్తుందనే విషయం మనకు తెలిసిందే, కాగా కోపం కూడా ఒక రకమైన భావ వ్యక్తీకరణే కావడం చేత కోపానికి మూలమైన భావం మొదట తల (మెదడు) లోనే పుడుతుందని చెప్పవచ్చు. మెదడు నుండి వెలువడే సందేశం చాలకనాడుల ద్వారా శరీరంలోని ఇతర భాగాలకు చేరుతుంది. కోపం కూడా అదే దారిలో ప్రయాణం చేస్తుంది. మనిషి కోపానికి గురియైన మరుక్షణమే నాడీ మండలం ఉత్తేజితమౌతుంది.

స్ట్రెస్ హర్మోన్లు ( ఒత్తిడిని కలిగించే హార్మోన్లు) ఎక్కువ సంఖ్యలో విడుదలై రక్త ప్రసరణ వేగం పుంజుకోగా రక్తనాళాల్లో అలజడి చెలరేగుతుంది. ఫలితంగా గుండె కొట్టుకోవడం పెరుగుతుంది. క్రమం తప్పుతుంది కూడా.

"రక్త క్రమబద్ధీకరణకు విఘాతం కలిగించడం ద్వారా కోపం మనిషి ఆరోగ్యంతో చెలగాటమాడుతుంది." అని వైద్యవిజ్ఞాన శాస్త్రం ధ్రువీకరించింది. అంటే తరచుగా కోపానికి గురయ్యేవ్యక్తి తనగోతిని తనే తీసుకుంటున్నాడన్న మాట. కోపం వలన కలిగే శారీరక దుష్పరిణామాలను అలా ఉంచితే...

కోపం కలుగడం వల్ల మనిషిలో పంతం, పట్టుదల దుస్సాహసం, ఈర్ష్య, ద్వేషాదుల వంటి దుర్గుణాలుద్భవించి మనిషి చేత అనేకానేక తప్పుల్ని చేయిస్తాయి. తనమాట ద్వారా, నడవడి ద్వారా, మంచి మనసుద్వారా మనిషి సమాజంలో సంపాదించుకునే కీర్తిప్రతిష్టలను నాశనం చేస్తాయి. కోపం వల్ల మనిషి శారీరకంగా, మానసికంగానే కాకుండా కీర్తిప్రతిష్టల పరంగా, భవిష్యత్తు పరంగా కూడా నష్టపోతాడన్నమాట ఒక్క మాటలో చెప్పాలంటే కోపం వల్ల మనిషి సర్వనాశనమై పోతాడని చెప్పవచ్చు. సమాజంలో ఎవరిస్థాయి ఎంత అనే విషయాన్ని అంచనావేయడానికి కోపం ఒక కొలమానంగా ఉపయోగపడుతుంది. కోపం సమాజానికి చేయగల మేలు బహుశా ఇదొక్కటేనేమో!

ఉత్తమునికి కోపం వస్తే ఒక్క క్షణం. మధ్యమునికైతే ఒక పగలు-ఒక రాత్రి. అధమునికి కోపం వస్తే ఒక జీవితకాలం ఉంటుందని ఆర్యోక్తి. మనుషులు కోపానికి రావడం సహజమే అయినా ఆ కోపకాలపరిమితిననుసరించి వారివారి స్థాయిని నిర్ణయించవచ్చు. తద్వారా ఏ మనిషికి ఎంత విలువివ్వాలనేది సమాజం నిర్ణయించుకుంటుంది.

కోపం రకరకాలుగా ఉంటుంది. రకరకాలుగా తన ప్రభావాన్ని చూపెడుతుంది. అందుకేకాబోలు కొందరి కోపాన్ని చూస్తే భయం కలుగుతుంది. మరికొందరి కోపాన్ని చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. నవ్వును, జాలిని వెగటును కలిగించే కోపాలు కూడా ఉంటాయి. కొందరు కోపానికి వస్తారంటే ఎందుకోనమ్మబుద్ధికాదు. మరికొందరు కోపానికి రారని నమ్మకంగా చెప్పినా కూడా నమ్మాలనిపించదు. ఇందులో మొదటి రకం కోపాన్ని నటించేవాళ్లైతే, రెండవరకం శాంతాన్ని అభినయించే వాళ్లన్నమాట.

అగ్నివంటి కోపాన్ని కురిపించేవాళ్లు కొందరైతే, ఆవిరివంటి కోపాన్ని ఆవిష్కరించేవాళ్లు కొందరు.

పాలపొంగు వంటి కోపం కొందరిదైతే, పాముబిషం వంటి కోపం కొందరిది. నివురుగప్పిన నిప్పులాంటి కోపం కొందరిది కాగా ఎప్పుడో ఎక్కడో అతి కొద్ది మందిలో మాత్రమే అరుదుగా కనిపించేదే నిజాయితీతో కూడిన కోపం (ధర్మాగ్రహం)

ఎవరిపైన కోపం వస్తే వాళ్లపైననే చూపిస్తారు కొందరు. ఇలా చూపించడానికి ధైర్యము, హోదాల్లాంటివి కావాలి మరి. తమ కోపాన్ని ఎదుటివాళ్లపై చూపించలేనప్పుడు అక్కడ ఉన్న వస్తువులపై కొందరు చూపిస్తే ఆ సమయంలో దొరికిన అమాయకులపై కొందరు చూపిస్తారు. ఎదుటి వాళ్లను ఏమీ చేయలేనప్పుడు ఎక్కడో ఉన్నవాళ్లను నిందిస్తూ, శపిస్తూ ఊరటపొందే జీవులు కొందరు.

ముందు వెనకలు ఆలోచించకుండా తమ కోపాన్ని వెదజల్లే వాళ్లు కొందరైతే సమయాన్ని సందర్భాన్ని కనిపెట్టి తమ కోపాన్ని ప్రదర్శించే కోవిదులుకొందరు. తమ కోపంతో ఇతరుల ఉసురుపోసుకునేవాళ్లు కొందరు కాగా తమ ఉసురే తీసుకునేవాళ్లు మరికొందరు.

ఏది ఏమైనా

కోపంపరిధి అనంతమనే చెప్పకోవాలి. కోపానికిరాని మనిషి లేనేలేడంటే చచ్చినట్లుగా ఒప్పకోవాలి. "వానకు తడవని వాడు, కోపం రానివాడు లేడని" సామెతకోపం మానవులకు మాత్రమే కాదు మానవేతర ప్రాణులకు, పంచభూతాలకు, ప్రకృతిలోని ఇతరేతర శక్తులకు కూడా వస్తుంది. మనుషుల్లో దేవుళ్లుగా, మహనీయులుగా, మహితాత్ములుగా ముద్రపడ్డ వాళ్లు సైతం కోపానికి వచ్చిన సందర్భాలు కొల్లలుగానే కనిపిస్తాయి.

అసలు కోపం అనేమాట గుర్తుకు రాగానే ఎవరికైనా ఠక్కున గుర్తుకువచ్చే పేరు దుర్వాసమహామునిదే అంటే అతిశయోక్తి కాదు. కోపానికి ఆ మహానుభావునికి ఉన్న అవినాభావ సంబంధం అలాంటిది మరి. నేటికీ సమాజంలో ఎవరైనా తరచుగా కోపానికి గురౌతుంటే ఎదుటి వారిని హడలగొట్టేలా కేకలువేస్తూ అరుస్తుంటే ఆ వ్యక్తిని అపర దుర్వాసుడనో, దుర్వాసునికి అన్నగారనో, తమ్ములుంగారనో పేర్కొటుండడాన్ని గమనించగలం. ముక్కుమీది కోపానికి పెట్టింది పేరైన దుర్వాసుడు మహర్షిగా, తపస్సంపన్నునిగా ఎలా నిలదొక్కుకున్నాడో, ఎలా గుర్తింపును పొందాడో! ఆలోచిస్తే ఒకింత ఆశ్చర్యంగానే అనిపిస్తుంది కదూ!.

గొప్పవాళ్ళుగా గుర్తింపబడ్డ వాళ్ళు సైతం (వీళ్లలో కొందరు కోపతాపాలకు బానిసలని చెప్పడానికి కావలసినన్ని ఆధారాలున్నప్పటికినీ... గొప్పవాళ్ళుగా ఎలా పరిగణణకెక్కిందీ తెలియదు.) కోపానికి గురైన సంధర్భాలున్నాయని ఇంతకుముందే చెప్పకున్నాం. ఉత్తముల కోపం క్షణకాలం అన్నట్లుగా, తమ కోపం నుండి బయటపడ్డ వాళ్లు కొందరైతే కోప ప్రభావం నుండి బయటపడలేక తమ ఖ్యాతి గౌరవాలకు మచ్చ తెచ్చుకున్నవాళ్లు కొందరు.

☆ కొన్ని ఉదాహరణలు చూద్దాం.

తన రాకను గమనించలేదన్న ఆవేశంతో సాక్షాత్తూ దేవదేవుడైన శ్రీ మహావిష్ణువునే కాలితో తన్నిన ఫలితంగా భృగుమహర్షి తన కాలిలోని కన్నును ఖ్యాతిని పోగొట్టుకున్నాడు. (జరిగిన దురదృష్టకర సంఘటనను జరుగబోయే మంచిపనికి మూల కారణంగా నిలుపడం మహాత్ములు చేసే పని) తను పలుకరిస్తే పలుకలేదన్న కోపంతో తపస్సు చేసుకుంటున్న మహర్షి మెడలో చచ్చిన పామునువేసి పరీక్షిత్తు మహారాజు ప్రాణాల మీదకు తెచ్చుకున్నాడు. విశ్వామిత్రుడు, పరశురాముడు... మొదలైన వాళ్లంతా తమతమ కోపావేశాల మూలంగా అంతో ఇంతో నష్టపోయినవాళ్లే.

ఆవేశానికి ఆకలెక్కువ మెదడులోని ఆలోచనను ఆరగించడమంటే దానికి మక్కువ, ఆవేశ పీడితుడై పంతానికిపోయి అతివ అడిగిందానికల్లా అంగీకార సూచకంగా తలూపిన యమ ధర్మరాజు సావిత్రిముందు ఓడిపోయి, ఆనక తలపట్టుకున్న సంఘటన కోపం ఎంతటివారినైనా ఓటమిపాలు చేస్తుందనడానికి ఒక ఉదాహరణ మాత్రమే.

ఆవేశానికి ఆకలెక్కువైనట్లుగానే ఆకలికి కూడా ఆవేశమెక్కువ మనిషిలోని వివేకాన్ని నాశనం చేయడమంటే దానికి తగని మక్కువ ఈ కథ వింటే నా మాటలు నిజమని మీరే అంగీకరిస్తారు.

ఒకసారి కాశీనగరంలో వ్యాస మహర్షికి రెండు రోజులపాటు భోజనం లభించలేదు. శిష్యులు, తనూ ఎంతగా ప్రయత్నించినా తమకు కావలసిన కనీసభోజనాన్ని కూడా పొందలేకపోయారు. ఎవరింటికివెళ్లి అడిగినా ఏదో కారణం చెబుతున్నారే తప్ప ఎవరూ భిక్షవేయడం లేదు. ఈ పరిస్థితిని చూసి వ్యాసమహర్షి ఖిన్నుడైపోయాడు చివరకు ఆకలికి తట్టుకోలేక కాశీనగరాన్ని శపింపబూనుకున్నాడు కూడా!. సరిగ్గా ఆ సమయంలో ఒక వృద్ధబ్రాహ్మణ స్త్రీ అక్కడకు వచ్చింది. వ్యాసున్ని అతని శిష్యులను భోజనానికై తన ఇంటికి ఆహ్వానించింది.

ఆమె ఆహ్వానానికి సంతసించిన వ్యాసుడు శిష్యులతో కలిసి ఆమె ఇంటికి వెళ్లి సుష్టుగా భోంచేశాడు. భోజనం పూర్తయి విశ్రాంతిగా వ్యాసుడు ఆరుబయట కూర్చొని ఉన్న సమయంలో ఆ స్త్రీ వ్యాసునివద్దకు వచ్చి " ఏమయ్యా పదునెనిమిది పురాణాలను వ్రాసినవానివి. నాలుగు వేదాలను విడదీసిన జ్ఞానివి రెండు పూటలు భోజనం దొరకనంత మాత్రాన వివేకాన్ని కోల్పోయి 'పుణ్యగుణాల రాశియైన కాశీ' నగరాన్ని శపింపబూను కోవడం ఏమైనా బాగుందా? " అని అడిగింది. తన అవివేకానికి తలదించుకోక తప్పలేదు వ్యాసమహర్షికి. అందుచేత ఆవేశానికి ఆకలి కలుగకుండా, ఆకలికి ఆవేశం కలుగకుండా చూసుకోవడం అవసరం మరి.

గొప్పవాళ్ల సంగతులను ఇక్కడితో వదిలేసి సామాన్యుల కోపతాపాల సంగతిని చూద్దాం. పేరుకు వీళ్లు సామాన్యులే అయినా కోపతాపాల విషయంలో మాత్రం వీళ్లు అసామాన్యులని ముందే మనవి చేసుకుంటున్నాను. తమకెటూ చెప్పకోదగిన పేరు ప్రతిష్ఠలు లేవన్న ధీమాతో కాబోలు వీళ్లూ గొప్పగానే రెచ్చిపోతుంటారు. ముందు వెనకలాలోచించకుండా చలరేగిపోతుంటారు. వీళ్లకు పేరు ప్రఖ్యాతులు లేవు కాబట్టి వీళ్ల పేర్లు లేకుండానే కొన్ని ఉదాహరణలు చూద్దాం.

ఒకాయనకు కోపం వస్తుంది ఫలితంగా సంవత్సరం తర్వాత నాలుగైదు ఆత్మలు ఊరిబయట స్మశానం లోని చెట్లపైన కాపురం చేస్తుంటాయి. ఈయన ఎక్కడో ఇనుపఊచల్ని లెక్కబెడుతూ కూర్చొనుంటాడు. మరొకాయనకు కోపం వస్తుంది. అతని ఇంటిలోని బిందె, చెంబు, తపేలాలు ఆ కోపాన్ని భరిస్తాయి. ఈయన మధ్యతరగతి మానవుడని ఆ ఇంటికి వచ్చిపోయే వాళ్లకు సొట్టమొహాలు పెట్టుకొని అవే చెబుతుంటాయి.

ఇంకొకాయనకు కోపం వస్తుంది. పగిలి రక్తం పేరుకున్న ఆయన పెదవి ఈ విషయాన్ని చాటుతుంది. ఈయన పేదవాడన్న విషయం మీకీపాటికి అర్థమయ్యే ఉంటుంది. ఒకాయన రోడ్డుపై గొణుక్కుంటూ వెళ్లుతుంటే వాళ్ల ఆఫీసరుగారికి కోపం వచ్చినట్లు, మరొకాయన హోటల్లోని సర్వర్లపైన ధూంధాంలాడుతుంటే ఇంట్లోవాళ్లావిడకు కోపం వచ్చినట్లు ఎవరైనా తెలికగానే అర్థంచేసుకోగలరు.

ఒకాయనకు కోపం వస్తుంది. ఫలానావారిపైన అని ఖచ్చితంగా చెప్పలేం. ఎందుకంటే ' నా చావుకు ఎవరూ బాధ్యులుకారు' అని అతడే వ్రాసిపెట్టాడాయె. అందుచేత టోటల్‌గా అతని కోపానికి, దాని ఫలితానికి ఈ వ్యవస్థ బాధ్యురాలిగా నిర్ధారించబడుతుంది.

ఒకాయనకు నిజం చేప్పేవాళ్లంటే ఒళ్లుమంట మరొకాయనకు నిజాయితీగా బ్రతికేవాళ్లను చూస్తే కళ్లమంట నవ్వుతూ, నవ్విస్తూ బ్రతికేవాళ్లను చూస్తే కొందరికి కడుపుమంట అబద్ధం చేప్పేవాళ్లంటే మండి పడేవాళ్లు కొందరైతే, అవి నీతిపరులను నిలువునా పాతరెయ్యాలంటూ ఉక్రోశాన్ని వెలిబుచ్చేవాళ్లు కొందరు.

ఒకాయనకు చేయి చూసేవాళ్లంటే చెప్పలేనంత కోపం. పూజలు చేసేవాళ్లంటే, నోములు నోచేవాళ్లంటే మరొకరికి కోపం. ఈ తరహా పనులు చేయని వాళ్లంటే ఇంకొకరికి కోపం. ఒకరికి మాట్లాడేవాళ్లంటేకోపం. వేరొకరికిరాతలు రాసేవాళ్లంటేచెప్పలేనంత కోపం. అఫ్‌కోర్స్ తమకు నచ్చని ఏ విషయం పట్లనైనా అసంతృప్తిని, ఆగ్రహాన్ని వ్యక్తం చేసే హక్కు ప్రజాస్వామ్య భారతంలో ప్రతీ పౌరునికి ఉంటుందని మనమంతా గుర్తించాలి.

ఇలా ఎవరిపైన ఎవరికి ఎందుక్కోపం వస్తుందో ఎప్పుడు వస్తుందో, ఎంతకాలం ఉంటుందో ఎవరూ ముందుగా చెప్పలేరు. ఈ ప్రపంచంలో ఇన్ని మార్పులు వచ్చినా, ఇంత అభివృద్ధి జరిగినా కోప, తాపాల విషయంలో మాత్రం మనిషి ఇంకా రాతియుగంలోనే ఉన్నాడేమో! అనిపిస్తుంది. "చేతకాని వానికి కోపమెక్కువ" అనే మాటల ఆధారంగా చూస్తే 'కోపం మనిషి అసమర్థతకు దర్పణం' అని తెలిసి పోతున్నది కదా!

ఏది ఏమైనా,

సమాజాన్ని కోపం ఆనాడెంత నష్టపరిచిందో ఈనాడు అంతే నష్టపరుస్తుంది. గొప్పవాడైనా అల్పుడైనా కోపానికి అతీతులుగా నిలువలేకపోయారు. అయినా కూడా ఎవరు తమ కోపాన్ని ఎంతగా అదుపులో ఉంచుకోగలిగితే అంతగా రాణిస్తారన్నది. కాలాతీతంగా నిలిచే సత్యం.



# ఓ 'చూపు' చూద్దాం

సూర్యుని నుండి వచ్చే కిరణాలు వస్తువులపైబడి పరావర్తనం చెంది మన కంటిని చేరుకుంటున్న కారణంగా మనం ఈ లోకంలోని వస్తువులను చూడగలుగుతున్నామని విజ్ఞానశాస్త్రం చెబుతుంది. ఈ విశాల విశ్వంలోని ఏ వస్తువునైనా మనం స్పష్టంగా చూడాలంటే మన కళ్లు ఏ లోపం లేకుండా ఉండడం ఎంత ముఖ్యమో, కాంతికిరణాల పరావర్తనం కూడా అంతే ముఖ్యం. కేవలం వస్తువులను  చరాచరజీవులను, ప్రకృతిని, పరిసరాలను వీక్షించే ఈ చూపులు సాధారణమైన చూపులు. ఏ ప్రత్యేకతలు, విశిష్టతలు లేని, ఏ భావాన్నీ పలికించలేని, ఏ అంశాన్నీ స్పృశించలేని, ఏ అర్థాన్నీ వ్యక్తం చేయలేని మామూలు చూపులు.

రంగు, రుచి వాసనల్లేని స్వచ్ఛమైన నీటిలా, ఏ లక్షణాలు సోకని ఈ చూపులను 'స్వచ్ఛమైన చూపులు" అందాం, బహుషా సృష్టి ఆరంభకాలంలో మనిషి చూపులు ఇలాఉండిఉంటాయి. అయితే కాలక్రమాన మనిషిలో, ప్రకృతిలో అనేకానేక మార్పులు చోటుచేసుకున్నాయి. 'మనిషి నాగరీకుడయ్యాడని ఎంతగానో అభివృద్ధి చెందాడని', శాస్త్రాలు, ముఖ్యంగా... విజ్ఞాన శాస్త్రాలు చెబుతున్నాయి. అప్పుడప్పుడు చరిత్ర కూడా ఈ విషయాన్ని అంగీకరిస్తుంది. నాగరీకుడైన మనిషి చూపుల్లో ఎన్నో మార్పులు..., ఎంతో అభివృద్ధి చోటు చేసుకున్నది. ఈ క్రమంలో.. చెప్పకోదగిన, చెప్పకోలేని విషయాలు, విశేషాలు, వింతలు ఎన్నెన్నో చోటుచేసుకున్నాయి. ఈ చూపుల చరిత్రను గమ్మత్తుగానే ఓ చూపుచూద్దాం.

అసలు చూపుల్లో రకాలున్నాయా ? ఉంటే ఎన్ని రకాలున్నాయి? అవి ఏవి ? ఈ చూపుల పరిశీలన శాస్త్రీయమా ? అనే విషయాలను కాసేపు పక్కన పెడదాం. ఈసృష్టిలో ప్రాణమున్న ప్రతిజీవికి ఇంచుమించుగా చూపు ఉంది. అయితే ముందే చెప్పకున్నట్లుగా మార్పు అనేది ఎక్కువగా మానవజాతిలోనే జరిగింది. కాబట్టి చూపుల్లో మార్పు కూడా మానవజాతిలోనే జరిగిందని భావించడంలో తప్పేమి లేదు. నాగరీకుడైన మనిషి చూపుల్లో కాలక్రమాన ఎన్నెన్నో భావాలు, భాష్యాలు, అర్థాలు, పరమార్థాలు, లక్ష్యాలు,  లక్షణాలూ చోటుచేసుకున్నాయి. కొండొకచో నాగరికత తెలియని జంతువుల, పశుపక్ష్యాదుల చూపుల్లోని లక్షణాలు కూడా కనిపిస్తుండడం విశేషం. ఈ క్రమంలో ముందుగా ఆ చూపులను గురించి చెప్పకుందాం.

అడవిలోని జంతువుల్లోకెల్లా విశిష్టమైన జంతువు పెద్దపులి. చూపుల్లో రాజసం, నిర్భయత్వం తొణికిసలాడే పెద్దపులి చూపులను ధర్మాత్ముడు, దయ, దానగుణసంపన్నుడు, పరులమేలు కాంక్షించేవాడైన పెద్దమనిషికి అన్వయించడం కనిపిస్తుంది. పెద్దపులిలో పరుల మేలును కాంక్షించే లక్షణం మృగ్యమే. అయినప్పటికినీ ఆ చూపుల్లోని గాంభీర్యమాధారంగా ఈ పోలిక సమంజసంగానే కనిపిస్తుంది.

ఈర్ష్యాద్వేషాలకు పట్టుబడని, స్వార్థానికి, అవివేకానికి తావివ్వని, ధర్మనిరతుడైన పెద్దమనిషి చూపులను (దృష్టిని), పెద్దపులి చూపులుగా పేర్కొంటే, పెద్దమనిషి కావాలని ప్రయత్నించీ ధర్మ, దయా, దానగుణాలు లేని కారణంగా ఊరిపెద్ద కాలేకపోయిన (కుహనా) పెద్దమనిషి ( తాను పెద్దమనిషినని తనకు తానే అనుకుంటాడు. తన వాళ్ల చేత అనిపించుకుంటాడు ) చూపుల్ని నక్క చూపులుగా పేర్కొనవచ్చు.

శవాలను పీక్కుతినడం లక్ష్యంగా గోతికాడ కాచుక్కూర్చున్న నక్క స్వభావంతో పాటు దురాశ నిండిన దాని చూపులను పుణికిపుచ్చుకున్న సదరు పెద్దమనిషి తన చూపుల కారణంగానే సమాజంలో చులకనౌతాడు.

నింగిలో అంతెత్తున ఎగురుతూనే నేలపైనున్న చిన్న కోడిపిల్ల కదలికలను సైతం నిశితంగా పరిశీలించే చూపులు డేగకు స్వంతం. ప్రతినాయకుని ఆటలు కట్టించే కథానాయకునికి ఉండవలసినవి ఇటువంటి చూపులే. కాగా బీదసాదలను ఆదరిస్తూ కడుపారా కూడు పెట్టే ఉత్తమురాలైన ఇల్లాలి చూపులను గోమాత చూపులతో పోల్చడం సమంజసంగానే ఉంటుంది. కేవలం ఒకవైపుకే చూస్తూ వెక్కిరింతకు గురయ్యేవి కాకి చూపులు. కళ్ళు మూసుకున్నట్లుగా నమ్మించి వంచించేవి కొంగచూపులు.

కొంగచూపులను పోలి ఉండేవి దొంగచూపులు. నిశితంగా పరిశీలించడం. (గుచ్చి గుచ్చి చూడడం అనికూడా అనవచ్చు. చురుగ్గా కదలడం అస్పష్టంగా కనిపించే వాటిని స్పష్టంగా చూడగలగడం. ఎవరికీ చిక్కకపోవడం వంటి ప్రత్యేకతలెన్నో ఈ చూపులకు స్వంతం. ఈ చూపుల వెనకాల ఉన్న కథ మీలో చాలామందికి తెలిసిందే. (క్షమించాలి వేరే ఉద్దేశ్యంతో అనడం లేదు.) అయినా మళ్లీ చూద్దాం.

అనగనగా ఒక అబ్బాయి ఓ అందమైన అమ్మాయిని చూసీ, చూడగానే (లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అన్నారు కదా!) ప్రేమించడం మొదలుపెట్టాడు. మనవాడు ప్రేమిస్తున్న విషయం పాపం ఆ అమాయకురాలికేమో తెలియదు. ఆమె కదలికలను జాగ్రత్తగా పరిశీలిస్తూ, ఆమె తిరుగాడే ప్రదేశాల దాపున బీటువేస్తూ, ఆమెనే గమనిస్తూ, రెప్ప వేయకుండా చూస్తూ వీలున్నంత దూరం వెంబడిస్తూ ఉంటాడు.

ఎన్నెన్ని జతల కళ్లు తమ వ్యవహారాన్ని గమనిస్తున్నా పట్టించుకోడు కానీ, అనుకోకుండా ఆ అమ్మాయి వెనక్కి తిరిగి చూస్తే మాత్రం మనవాడు టకీమని వెనక్కి తిరిగి ఆకాశంపైపో, చుట్టూ ఉన్న ఎత్తైన భవనాల వైపో, అదివరకెప్పుడు వాటిని చూడనట్లుగా చూస్తూ నిలబడతాడు. ఆ అమ్మాయి తిరిగి నడక ప్రారంభించగానే మనవాడి చూపులు తూపులై ఆమెను తాకుతూనే ఉంటాయి.

ఒకానొక శుభముహూర్తంలో ఈ దొంగచూపులకు ఆ అమాయకపు చూపులు (బేల చూపులు) చిక్కుతాయి. తప్పించుకోవడానికి తంటాలుపడి, తప్పించుకోలేని స్థితిలో దొరికిపోతాయి. ఒక చూపుకోసం.... మరోచూపు..... ఎదురుచూపై....చూసి...... క్రమంగా కలిసిపోతాయి. లోకంచూపుల్ని ఏ మాత్రంలెక్క చేయకుండా చెట్టపట్టాల్ వేసుకొని రంగుల లోకంలో షికార్లుచేస్తాయి. కళ్లుమూసుకొని కూడా తమ ప్రియతముల్ని స్పష్టంగా చూడగలిగే శక్తి ఈ చూపులకుంటుందంటే.అతిశయోక్తి కాదు. పెళ్లిచూపులను పరిహసించే ఈ చూపులు 'స్వయంవరా' న్ని స్వాగతించి స్వతంత్ర జీవితాన్ని ప్రారంభిస్తాయి.

ఈ తరహా దొంగ చూపుల్లో కూడా ఎంతో కొంత నిజాయితీ ఉంటేనే కథ సుఖాంతమౌతుంది. నిజాయితీ లోపించినప్పుడు అవి వెకిలిచూపులౌతాయి. అమ్మాయిల శరీరాల్లోని అణువణువునూ గుచ్చి చూస్తూ వికృతానందాన్ని పొందే ఈ దుర్మార్గపు చూపుల కారణంగానే కొందరికి ఎదుటి వాళ్ల చూపులంటేనే కంపరం ఏర్పడి ఉంటుంది. ఈ నీచ, నికృష్ట చూపులకు అడ్డదారిలో దక్కిన అధికారం కానీ, ధన, పశు ( తన, తనవాళ్ల ) బలాలు కానీ, తోడైతే ఇంక చెప్పేదేముంది. రోడ్డుపైన ఒంటరిగా నడుచుకుంటూ పోయే అమ్మాయిలకు భూలోకంలోనే నరకలోకం కనిపిస్తుందన్నమాటే.

**ఇటువంటి చూపులకు బలయ్యే అమ్మాయిలకళ్లకు నిటలాక్షుని మూడవకన్నులోని తీక్షణత అబ్బితే సమంజసంగా ఉంటుందనేది నా వ్యక్తిగత అభిప్రాయం.**

ప్రేమలోకంలో విహరించే ప్రేయసీప్రియుల మధ్యన ఆరాధనా పూర్వకమైన చూపులు, అభినందనపూర్వకమైన చూపులు, రాగరంజితమైన చూపులు, వెన్నెలల్ని వెదజల్లే చూపులు. కొంటె చూపులు, తుంటరిచూపులు, ఓరచూపులు, చిలిపిచూపులు, మత్తెక్కించే చూపులు, మరులుగొల్పే చూపులు, మైమరిపించే చూపులు, నవ్వించేచూపులు, కవ్వించేచూపులు కలిగించేచూపులు, కరుణించేచూపులు, సమయానుకూలంగా, సందర్భానుసారంగా చోటు సంపాదించుకుంటాయి.

యువతీ యువకుల మధ్య అంకురించే ప్రేమను ధృఢమైన రాగబంధంగా తీర్చిదిద్ది, లోకానికి ప్రేమలోని మాధుర్యాన్ని తెలియజేసేవి ఈ చూపులే సుమా!

తన ఆరాధ్యదైవం తనవైపుకు కనుచివరల నుండి చూసినా అదే మహద్భాగ్యంగా భావిస్తాడు భక్తుడు. ఆ చూపులనే కటాక్షం (కడగంటి చూపులు) గా పేర్కొంటారు. తను ప్రేమించిన అమ్మాయి (తన ప్రేమదేవత) కూడా తనవంక కడకంటితో చూసినా చాలని ఆశపడే అబ్బాయిలు భక్తుల వేషాల్లో దేవాలయాల్లో తిరుగాడుతుండడాన్ని మీరు గమనించే ఉంటారు. ( ప్రేమ) దేవీకటాక్షం భక్తులకెంత ప్రియమైనదనే విషయాన్ని మనం దేవాలయాల్లోనే తెలుసుకుంటాం.

చూపుల్లో సుధలు కురిపించేవాళ్లు కొందరైతే విషాన్ని వెదజల్లే వాళ్లు కొందరు అభయప్రధానంగావించే వాళ్లు కొందరైతే ఆగ్రహాన్ని ప్రదర్శించే వాళ్లు కొందరు అనురాగాన్ని వర్షించేవాళ్లు కొందరైతే. క్రౌర్యాన్ని కుమ్మరించే వాళ్లు కొందరు. ఎదుటివాళ్లను మంత్రముగ్ధులను చేయగల వాళ్లు కొందరైతే నిప్పుల్ని రాల్చేవాళ్లు కొందరు మెదటిరకం చూపులకు శ్రీరాముడు, శ్రీకృష్ణుడు బుద్ధుడు, క్రీస్తు వంటి మహనీయులు పెట్టింది పేరు కాగా రెండవ రకం చూపులు రావణ, కంస, నరకాసురాదులకే స్వంతమని చెప్పకోవచ్చు.

కొన్ని చూపులు ప్రశ్నిస్తాయి. కొన్ని జవాబులు చెబుతాయి. కొన్నిచూపులు నిలదీస్తాయి. మరికొన్ని అలరిస్తాయి. కొన్ని చూపులువలకరింపులైతే కొన్ని, వెక్కిరింపులౌతాయి. ఆహ్వానించే చూపులు కొన్నైతే ప్రశంసించే చూపులు కొన్ని, అభ్యర్థించే చూపులు కొన్నైతే, ప్రార్థించే చూపులు కొన్ని ఆజ్ఞాపించే చూపులు చాలా అరుదుగా కనిపిస్తాయి. అనురాగాన్ని పంచేచూపులు అనుమానాన్ని పెంచే చూపులు, అసహ్యాన్ని కలిగించే చూపులు అవహేళన చేసే చూపులు వేరు వేరుగా ఉంటాయి.

తాము వేసుకున్న పథకం విఫలమైనప్పడు తలపట్టుక్కూర్చున్న మిత్రులు తమ పథకాన్ని విఫలం చేసిన మనిషి కంటపడగానే చూసేచూపులను కొరకొరచూపులుగా పేర్కొనవచ్చు. తామూహించని విధంగా ఎదుటివ్యక్తి తమ ఆశల ఫలితాన్ని ఎగరేసుకుపోతుంటే ఆశ్చర్యంతో నోరుతెరచి చూస్తుండి పోయే చూపులనే మిరమిరచూపులుగా చెప్పకోవచ్చు. నిన్నటిదాకా మన కళ్లముందు తిరుగాడిన అతిమామూలు వ్యక్తి ఒకడు ఒక్కసారిగా ఎదిగిపోయి చుక్కలలోకంలో మకాంపెడితే- అతని వంక చూసే చూపులను నిభిడాశ్చర్యంతో చూసే చూపులుగా మహాకవి శ్రీశ్రీ పేర్కొన్నారు.

కొన్నిచూపులు బాగానే ఉంటాయి. కానీ ఏ వస్తువునూ, మనిషినీ అవి లెక్కచేయవు, పట్టించుకోవు ఈ కళ్లకు అహంకారపు పొరలు కమ్మాయని అనుభవజ్ఞులు కొందరు నిర్ధారిస్తారు. (కళ్లు నెత్తికెక్కాయనే మాటను వాళ్లు ఈ సందర్భంగా వాడుతారు.) విపరీతంగా ధనం సమకూరడం వల్లకానీ, అనుకోకుండా అందలం దక్కడం వల్లగానీ, తమ తెలివి తేటలు. అందచందాలపై నమ్మకం మితిమీరడం వల్లగానీ ఈ రకమైన అహంకారపు పొరలు కమ్మే అవకాశాలున్నాయని సదరు అనుభవజ్ఞులే తేల్చిచెప్పారు.

రెప్పవేయడం పట్ల కూడా శ్రద్ధ కనబరచకుండా ( నిర్లిప్తంగా) కొన్నిచూపులు అదేపనిగా శూన్యంలోకి చూస్తూ ఉంటాయి. ఆచూపుల్ని చూసే కళ్లల్లో ఏ లోపమూ లేదని నేత్రవైద్యులు సెలవిస్తే. ఆ విషయాన్ని రచయితలు ఏమాత్రం అంగీకరించరు. వాటిని గాజుకళ్లుగా పేర్కొని ఆ చూపులను జీవంలేని చూపులుగా విశ్లేషించారు. ఈ చూపుల్లో జీవం లేకపోవడానికి ఓ కారణం ఉంది. ఆ కారణం వెనుక ఓ కథ కూడా ఉంది. అసలేం జరిగిందంటే!

ఈ రకమైన గాజుకళ్లున్న కుర్రాడు (అప్పట్లో ఇతని కళ్లు బాగానే ఉండేవి చలాకీగానే కదిలేవి) ఓ రోజున వాలుచూపుల కనకమహాలక్ష్మిని చూశాడు. అంతే మనవాని కళ్లు ఆనందంతో మెరిశాయి. అవి కనకమహాలక్ష్మికళ్లతో కోలాటమాడాలని ఆరాటపడ్డాయి. కలిసి కదలాలని కలలుకన్నాయి.

అయితేనేం !

అదృష్టం ఈ కుర్రాడికి అందనంత దూరాన నిలబడి చోద్యం చూడాలని నిర్ణయించుకుంది. సమయమేమో కలిసి రాలేనంది కాలంతో కొంగు ముడేసుకొని కనకమహాలక్ష్మి కదిలిపోయింది. కన్నీళ్లను బిగపట్టుకున్న కళ్లలో మనవాడు మిగిలిపోయాడు. గాజుపాత్ర వంటి హృదయం ముక్కలైంది. చలాకీగా కదిలేకళ్లు గాజుగోళాలయ్యాయి. లోకమంతా రంగులు వెలసిపోయిన కేన్వాసు కాగా సదరు కుర్రాడి కళ్లు శూన్యాన్ని తప్ప మరిదేన్నీ గమనించలేనిస్థితికి చేరుకున్నాయి.

శూన్యాన్ని చూసే చూపుల వెనకాల ఉండే కథలన్నీ ఇంచుమించుగా ఈ కోవకు చెందినవేనని ఇందువెంట తమకు మనవి చేసుకుంటున్నాను.

రెండు కళ్లూ బాగానే ఉన్నా ఈ లోకాన్ని సరిగా చూడడం చేతకానివాళ్లు ఎందరో ఉన్నారు. వీళ్లల్లో కొందరు అవకాశవాదులు కొందరు అమాయకులు, కాగా ఎక్కువమంది బ్రతుకనేర్చిన వాళ్లనే విషయం కొంత కష్టంగా ఉన్నా అంగీకరించక తప్పని నిజం. ఈవిషయంలో తమ చేతకానితనాన్ని అంగీకరించే నిజాయితీపరులు కొందరైతే, తమ దృష్టి లోపానికి తమ బాధ్యత లేదని అడ్డంగా వాదించేవాళ్లు కొందరు.

అసలు ఈ ప్రపంచాన్ని దాని గుణగణాలను ప్రత్యేకతలను అందులోని మంచి చెడ్డలను స్పష్టంగా చూడాలంటే చర్మచక్షువులు సరిపోవని విజ్ఞుల నిశ్చితాభిప్రాయం. అందుకోసం మనోనేత్రం (జ్ఞాననేత్రం) కావాలని సెలవిచ్చిన వాళ్లే. మనసుకు కళ్లుంటే మరోమనసులోని చీకటి వెలుగులను స్పష్టంగా దర్శించవచ్చని సూచించారు. జ్ఞాననేత్రంతో ఈ లోకాన్ని పరిశీలించిన మహితాత్ములు తాము దర్శించిన సత్యాలను సత్కావ్యాలుగా ఆవిష్కరిస్తారనే విషయం 'నానృషిః కురుతే కావ్యమ్ ✳ అనే సూక్తి వల్ల తెలుస్తుంది.

ఏది ఏమైనా,

ఎవరైనా, ఎప్పుడైనా, ఎక్కడైనా ఎలా చూడాలన్న విషయాన్ని ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. ఎవరు ఎలా చూస్తారన్న విషయం ఆధారంగానే ఎవరు ఎలాంటివాళ్లనే విషయాన్ని సమాజం నిర్ణయిస్తుంది.

అందువల్ల

అభిమానంగా, ఆత్మీయంగా, ప్రశాంతంగా, ప్రశంసాత్మకంగా ఎదుటివాళ్లను చూడడానికి ప్రతి మనిషి చిత్తశుద్ధితో ప్రయత్నించాలి. అలా చూడాలంటే అరిషడ్వర్గాలను అదుపులో ఉంచుకోగలిగే మనస్సు తప్పకుండా ఉండాలని మనవిచేస్తున్నాను.చల్లని చూపుల్ని చూడగల్గిన వాళ్లముందు ఈలోకం మోకరిల్లుతుందన్నది నిజం.

---

## ✳ " నా నృషిః కురుతేకావ్యమ్" ✳

'ఋషికాని వాడు కావ్యం వ్రాయలేడు' అని పై వాక్యానికి (నానుడికి) అర్థం. ఇది ఎలా వచ్చిందంటే!

**'కవి'పరంగా**

'కవి' అనే మాట మొట్టమొదటగా వేదాలలో భగవంతుని పరంగా వాడబడింది. తరువాతి కాలంలో భగవంతుని అనుగ్రహాన్ని పొందిన మహర్షులకు వాడబడింది. వేదమంత్రాలను దర్శించిన మహర్షులు వాటిని ఉపనిషత్తులుగా కూర్చి కవులుగా పిలువబడ్డారు. అనంతర కాలంలో లౌకిక కావ్యాలైన రామాయణ మహాభారతాలను వ్రాసిన వాల్మీకి, వ్యాసాదులు ఆ కావ్యాలను వ్రాసిన తరువాత (మొదట ఋషులైనప్పటికినీ) కవులుగా పిలువబడ్డారు.

ఇలా వేదమంత్రాలను దర్శించినవాళ్లు, లౌకిక కావ్యాలను వ్రాసినవాళ్లు ఋషులేకావడం చేత, వాళ్లు మాత్రమే కావ్యాలను వ్రాయడం చేత ఇతరులెవరూ కావ్యరచనకు పూనుకోకపోవడం చేత ఋషికాని వాడు కావ్యం వ్రాయలేడ (నా నృషిః కురుతేకావ్యమ్) నే నమ్మకం బలపడి కాలక్రమాన అది నానుడిగా ఏర్పడింది.

దీనినే ఇలా చెప్పకోవచ్చు.

✳ 'కవి' శబ్దం ఋషులకు మాత్రమే వాడబడింది కాబట్టి,

✳ మెదట్లో ఋషులు మాత్రమే కావ్యాలు వ్రాశారు కాబట్టి,

ఋషికానివాడు కావ్యం వ్రాయలేడనే నమ్మకం బలపడి నానుడిగా ఏర్పడింది.

**'కావ్య' పరంగా**

కవనీయమైనది కావ్యం.

కవనీయమనగా వర్ణనీయం (వర్ణించదగినది) అని భావం.

వర్ణన: చర్మ చక్షువుల ( మామూలు కళ్లు) కతీతంగా జ్ఞాననేత్రం ('మనసు' అనే కన్ను) తో చూసి చేసేది.

వర్ణనా శక్తి లోకోత్తరమైన ప్రతిభ ఉంటేనే సాధ్యమౌతుంది.

లోకోత్తరమైన ప్రతిభ భగవంతుని అనుగ్రహం ఉంటేనే................

భగవంతుని అనుగ్రహం తపస్సు వల్లనే సాధ్యమౌతుంది.

తపస్సు చేయడమే ఋషి చేసే పని కావడం చేత ఋషికానివాడు కావ్యం వ్రాయలేడనే నమ్మకం బలపడి కాలక్రమాన అది నానుడిగా ఏర్పడింది.

దీనినే ఇలా చెప్పకోవచ్చు.

✳ ఋషి తపస్సుతో భగవంతుని అనుగ్రహన్ని పొంది లోకోత్తరమైన ప్రతిభను సాధించగలడు.

✳ లోకోత్తరమైన ప్రతిభను సాధించినవాడే వర్ణనీయమైన కావ్యాన్ని వ్రాయగలడు కాబట్టి

**ఋషికానివాడు కావ్యం వ్రాయలేడనే నమ్మకం బలపడి నానుడిగా స్థిరపడింది.**



# కాలాతీత ప్రభావశక్తులు : డబ్బు - అధికారం

దేశకాలపరిస్థితులతో పనిలేకుండా మనిషిని బాగా ప్రభావితం చేయగల శక్తులు రెండు అవి (1) డబ్బు (2) అధికారం ఇవి రెండు ఆత్మీయురాళ్లైన అక్కాచెల్లెళ్ల వంటివి. పరస్పరం అభిమానించుకోవడం ఆప్యాయతల్ని కురిపించుకోవడం, ఒకరికొకరు తోడుగా, నీడగా, రక్షణగా నిలబడడమే తప్ప, అవమానించుకోవడం, ద్వేషించుకోవడం తెలియని ఆత్మబంధువులు. ఒకదాని అండతో మరొకటి వెలిగిపోగలదు. ఒకదాని ఆసరాతో రెండవది చరిత్ర సృష్టించగలదు. ఈ రెండు కలిసికట్టుగానూ, విడివిడిగాను కూడా శక్తివంతమై తమకెదురు తిరిగిన శక్తుల్ని సమూలంగా నిర్మూలించగలవు. తమ కొమ్ముకాసినవాళ్లను అందలా లెక్కించగలవు. అక్కడనే శాశ్వతంగా ఉంచనూగలవు. ముందే చెప్పకున్నట్లుగా ఈ రెండింటి మధ్యన పరస్పరసహకారమే తప్ప సంఘర్షణ లేదు.

నేటివరకూ సాగిన మానవజీవిత ప్రస్థానంలో డబ్బు, అధికారాలు ప్రముఖపాత్రనే పోషించాయి. నేటిసమాజంలో కూడా వాటిది ప్రముఖస్థానమేనన్నది మీకు తెలిసిన విషయమేకాగా, భవిష్యత్తులోకూడా వాటి ప్రాముఖ్యానికి వచ్చిన ముప్పేమి లేదని మనవి చేసుకుంటున్నాను.

డబ్బుకోసం అధికారం కోసం నేటిమనిషి పడే తాపత్రయాన్ని సమగ్రంగా వర్ణిస్తే అది రామాయణ, మహాభారతాలను మించిన (పుటల సంఖ్యలో) మహాగంథ్రమౌతుందంటే అతిశయోక్తి కాదు. అసలు... ధనం (మనవాళ్లు స్త్రీని సంపదగానే భావించేవాళ్లు) కోసం జరిగిన పోరాటం ఇతివృత్తంగారామాయణం అధికారం కోసం జరిగిన పోరాటం ఇతివృత్తంగా మహాభారతం రూపొందాయనే విషయం కూడా తమకు తెలియంది కాదు కదా!.

## ధనమే మూలం

మానవసమాజంలో డబ్బుది ప్రముఖమైన పాత్ర మానవ సంబంధాలలో అత్యంత శక్తివంతమైన సంబంధంగా పరిగణింపబడే రక్తసంబంధాన్ని సైతం ప్రభావితం చేయగల శక్తి కేవలం డబ్బుకు మాత్రమే ఉందంటే అది అసత్యం ఎంతమాత్రం కాదు. బంధాలను, అనుబంధాలను, అనురాగబంధాలను శాసించగల శక్తి డబ్బుకుంది. డబ్బు సంపాదించడం ద్వారా మనిషి సమాజంలో పొందగలిగే స్థాయి అత్యున్నతమైనది. అధికారపీఠానికున్న హోదాతో దర్పంతో సమంగా నిలబడదగ్గది కావడంచేత, సమాజంలో డబ్బు సంపాదించడానికి మనిషి ఎనలేని ప్రాముఖ్యాన్నిచ్చాడు.

డబ్బుతో దక్కే గౌరవం కోసం డబ్బుద్వారా స్వంతమయే సౌఖ్యాల కోసం మనిషి ఎంతగానో తపించిపోతాడన్న మాటలు అక్షరసత్యాలు కాలాతీతంగా తన శక్తిని చూపించగలిగే డబ్బుకోసం మనిషిపడే ఆరాటాన్ని దాన్ని సంపాదించడానికై, అతడు చేసే ప్రయత్నాల్ని, పొందే గెలుపు, ఓటముల తీరుతెన్నులను ఈ క్రమంలో పరిశీలిద్దాం.

డబ్బు సంపాదించాలనే లక్ష్యాన్ని ఏర్పరచుకొని అహోరాత్రులు శ్రమించేవాళ్లు అనేకులు. వీళ్లలో కొందరు చేసే శ్రమ కొండంత కాగా, పొందే ఫలితం మాత్రం గోరంతాగా ఉంటుంది. సరియైన ప్రణాళిక లేకపోవడం, సమయానుకూలంగా నిర్ణయాలు తీసుకోవడంలో పొందే వైఫల్యాలు వీళ్లు పొందాలనుకునే కొండంత ఫలితానికి అడ్డుపడి దానిని గోరంతగా మార్చివేస్తాయని వీళ్ల వ్యవహారాల్ని పరిశీలించే విజ్ఞులు తేల్చిచెప్పారు.

మరికొందరుంటారు వాళ్లనూ వీళ్లనూ నమ్మించి వాళ్ల దగ్గరా, వీళ్లదగ్గరా అందినంత మేరా అప్పలు తెచ్చి ఎంతో ఆర్భాటంగా పనిని (వ్యాపారం కూడా కావచ్చు) ప్రారంభిస్తారు. అవాంతరాలను ఎదుర్కొంటూ ఆటంకాలతో కుస్తీలు పడుతూ అవకాశాలను చేజార్చుకొని, అపజయాలను కొని తెచ్చుకుంటారు. అప్పలు తీసుకున్న వాళ్లు అనుకున్న లక్ష్యాన్ని సాధించలేరన్న నీతిని లోకానికందించిన మహానుభావులు వీళ్లేనని వేరే చెప్పనక్కర లేదనుకుంటాను.

ఇంకొందరుంటారు 'ఎంత చెట్టుకు అంతగాలి 'అన్నట్లుగా' 'గొర్రెతోక బెత్తెడే' అన్నట్లుగా ఎదుగూ, బొదుగూ లేకుండా తమ పనిని (వ్యాపారం....) కొనసాగించేవాళ్లు బాగా డబ్బు సంపాదించి ఖ్యాతి గడించాలన్న కోరిక కాలంతో పాటు కరిగిపోతూ ఉంటే, ఎప్పటికప్పడు ఎక్కడికక్కడ, రాజీపడిపోతూ బతుకుబండిని లాగేవాళ్లు. వీళ్లు డబ్బు సంపాందించి కోటీశ్వరులుగా ఖ్యాతి గడిస్తారన్నది కేవలం కలలోని మాట.

డబ్బు సంపాదించే క్రమంలో తాము నిర్దేశించుకున్న, లక్ష్యాలను చేరుకునేవాళ్లు అతికొద్దిమందే. కాగా వీళ్లలో కొందరు ఒక లక్ష్యం పూర్తికాగానే, మరొక లక్ష్యాన్ని నిర్ధేశించుకుంటారు. అది పూర్తికాగానే మరొకటి.... అది పూర్తికాగానే...... అదీ పూర్తి.......... ఇలా లక్ష్యాలు నిర్ధేశించుకుంటూ.... వాటిని సాధిస్తూ...... తిరిగి నిర్ధేశించుకుంటూ ముందుకు సాగిపోయే వీళ్లు డబ్బు సంపాదించడం తప్ప వేరే లక్ష్యం లేనివాళ్లై జీవితంలోని మాధ్యుర్యాన్ని కోల్పోయే ప్రమాదముంది.

డబ్బు సంపాదించేవాళ్లలోనే మరొక వర్గం వాళ్లు ఎప్పటికప్పడు గొప్ప లక్ష్యాన్ని నిర్ధేశించుకొని వాటిని చేరుకోవడంతో ఆత్మవిశ్వాసం పెరిగి, అది అలా శృతిమించి అహంకారంగా పరిణమించగా....... అందుకోలేని లక్ష్యాన్ని నిర్ధేశించుకొని, దాన్ని సాధించడంలో విఫలమై అవమానభారంతో నిష్క్రమిస్తారు.

మొదట్లో తాము సంపాదించుకున్న డబ్బును పేరు ప్రఖ్యాతులను అనంతరకాలంలో పోగొట్టుకునే ధ్యరదృష్టవంతులు వీళ్ళు.

బాగా డబ్బ సంపాదాంచాలన్న కోరిక ఉన్నవాళ్లలో గొప్పగొప్ప లక్ష్యాల్ని నిర్దేశించుకొని ఆనక ఒళ్లువంచడం చేతకాక, పదునుపెట్టడానికి సరిపడునంత బుర్రలేక పగటికలలు కంటూ బ్రతికేవాళ్లు కొందరు.

' సమానశీల వ్యసనేషు సఖ్యం ' అనే సూక్తి ప్రకారంగా నలుగురు వ్యక్తులు ఒక్కచోట కలిశారు. మిత్రులుగా ఏర్పడ్డారు. వీళ్లమైత్రిని ధృఢపరిచే అంశాలు నాలుగు అవి - 1) ఈనలుగురికీ కోటీశ్వరులు కావాలన్న కోరిక బలంగా ఉంది.. 2) అడ్డదారులు తొక్కాలన్న ఆసక్తి అమితంగానే ఉంది. 3) కష్టించి పనిచేయాలన్న తలంపు ఏ కోశానా లేదు. 4) నీతి,నిజాయితీలపై పెద్దగా నమ్మకం లేదు. ఈ నాలుగు లక్షణాలు నలుగురిలో ఉండి వీళ్లలో బలమైన స్నేహబంధాన్ని ఏర్పరచాయి.

నలుగురు కలిసి ఒకచోట కూర్చొని తమ మేధోసాగరాన్ని మథించారు. అనేకానేక హవాలా పథకాలకు రూపకల్పన చేశారు. పకడ్బందీగా వలలు వేశారు. ఎక్కడికక్కడ, ఎప్పటికప్పడు చాకచక్యంగా వ్యవహారాల్ని నడిపిస్తూ అనితరసాధ్యమైన రీతిలో ముందుకు సాగారు. అమాయకుల్ని వంచించారు. బలహీనుల్ని బుట్టలో వేసుకున్నారు. బాధ్యతగల అధికారులకు ఎరలు వేశారు. ధనవంతులను బెదిరించారు. తామనుకున్నది సాధించారు. లెక్కపెట్టడానికి వీల్లేనంత డబ్బును దక్కించుకున్నారు. నీతిని, ధర్మాన్ని తుంగలో తొక్కిన వీళ్లలో మంచితనం మానవత్వం మచ్చుకైనా కనిపించవు. అయినప్పటికినీ వీళ్ల హోదా, దర్పం, ప్రవర్తనాదులు ఎదుటి వాళ్లందరినీ ముక్కున వేళ్లేసుకునేలా చేస్తాయి.

వీళ్ల ఘనతను చూస్తూ ఆశ్చర్యపోయి నోళ్లు తెరచిన అమాయకులు ఆ ఆశ్చర్యం నుండి తేరుకోకమునుపే వీళ్ల నిర్వాకం బయటపడుతుంది. వేయికళ్లచట్టం వలకు చిక్కి, కటాకటాల వెనకాల కబుర్లతో కాలక్షేపం చేస్తూ ఉంటారు. డబ్బు సంపాధించాలన్న కోరిక బలీయమైన వ్యక్తుల్లో నిజాయితీ లోపిస్తే ఫలితం ఎలా ఉంటుందనే విషయాన్ని ప్రపంచానికి తెలియజెప్పిన పుణ్యమూర్తులు వీళ్లేనని మనవి చేసుకుంటున్నాను.

ఇంకొందరుంటారు.

రాత్రికిరాత్రే కోటీశ్వరులుగా మారిపోవాలని పట్టపగలే కలలు కనేవాళ్లు. తమ కలల్ని సాకారం చేసుకోవడానికై కనికరమంటే ఏమిటో తెలియనివాళ్లను, దురాశాపరులను, కక్కుర్తి మనస్తత్వమున్న వాళ్లను వెదికి పట్టుకొని దుస్సాహసాలే లక్ష్యంగా రంగంలోకి దిగిపోతారు. మనుష్యుల బలహీనతలతో వ్యాపారం చేస్తూ చీకటిసామ్రాజ్యానికి మకుటంలేని మహరాజులౌతారు. కోట్లకు అధిపతులైనా ఖ్యాతికి బదులు అపఖ్యాతినే మూటగట్టుకుంటారు. చీకట్లో చిద్విలాసంగానే ఉన్నా వెలుతురంటే భయమే, వెలుగును చూడలేరు. చూసినా తట్టుకోలేరు. వీళ్ల సామ్రాజ్యాలు, రాజభోగాలు సౌకర్యాలు అన్నీ మూన్నాళ్లముచ్చటే అనతికాలంలోనే తాము సంపాధించిన కోట్లకు రెక్కలొచ్చి ఎగిరిపోగా, వెలుగుకిరణాల తాకిడికి చీకట్లు ఛిన్నాభిన్నం కాగా, సామ్రాజ్యం కూలిపోగా, ఈతరహా సామ్రాట్టులంతా చీకట్లో కలిసిపోతారు............

చూద్దామంటే ఆనవాళ్లు ఉండవు చెప్పకోవడానికి చరిత్రా ఉండదు.

తమ పరమోద్దేశ్యం డబ్బు సంపాదించడమే అయినా ఆమాటే అంటే అంగీకరించని వాళ్లు కొందరు ఎందుకంటే వీళ్లంతా ప్రజాసేవ చేస్తామని ప్రమాణం చేసి తమనుతామే ప్రజాసేవకులుగా ప్రకటించుకొని మరీ రంగంలోకి దిగినవాళ్లాయె. అయినా వీళ్లు అంత పట్టుదలతో పూనుకొని పగలు, రాత్రి అనే పట్టింపు లేకుండా ప్రజాసేవ చేస్తుంటే వెధవది డబ్బు వద్దంటే వస్తుంది మరి. అసలు ధనలక్ష్మీ ప్రజాసేవ అనే అధికారపీఠంపై కూర్చున్న మహావిష్ణువునే వరిస్తుందన్నది మీకు తెలియంది కాదు కదా!. అందుచేత ప్రజానాయకులుగా చలామణీ అవుతున్న వారిలో అనేకులు సంపన్నచక్రవర్తులుగా మారిపోతే కోటీశ్వరుల జాబితాలో చేరిపోతే, అది డబ్బుకు, అధికారానికి మధ్యనున్న అన్యోన్య అనుబంధమే తప్ప సదరు ఎద్ద మనుష్యుల,నాయకుల తప్పేంకాదని, సరిపెట్టుకోగలిగిన జ్ఞానం మనకేనాటి నుండోఉంది. కాబట్టే ఆయా నాయకుల్ని మళ్లీ మళ్లీ ఎన్నుకుంటున్నాం కదా! (అందరినీ నిజంగా మనమే ఎన్నుకుంటున్నామన్న విషయం అంతా నిజం కాకపోవచ్చు కానీ ......... అలా అనుకుంటున్నామన్నది మాత్రం నిజం).

బాగా డబ్బు సంపాదించి కోటీశ్వరుల జాబితాలో చేరిపోవాలని కలలు కనేవాళ్లలో......... డబ్బు విలువను గుర్తించినవాళ్లతో పాటుగా దాని విలువ తెలియని 'అల్లాటప్పాగాళ్లు' కూడా ఉన్నారు. డబ్బును సరిగ్గా వినియోగించేవాళ్లతో పాటుగా దుబారా చేసే దుర్మార్గులూ ఉన్నారు. డబ్బును అసలేమాత్రం ఖర్చుచేయడం ఇష్టంలేని పరమపీనాసిగాళ్లు కూడా ఈ వర్గంలో ఉండడం విశేషం.

డబ్బు సంపాదించడమనేది అనుకున్నంత సులభంకాదని అనుభవంమీద తెలుసుకున్న మహానుభావులు కొందరు-

" నీతిమంతులు, ధర్మనిరతులు దక్షులు
నగువారు సేయు కార్యములు కొన్ని
సిద్ధిబొందవు దుష్టచిత్తులు క్రూరులై
చేయ కొన్ని విశేష సిద్ధిబొందు
ఊరక యుండంగనొందు కొందరవిపు
లార్థముల్ గొందరాయాసపడియు
నిష్ఫలారంభులై నిలుతురు"............ అంటూ

తాము డబ్బు సంపాదించలేకపోవడంలో పూర్వజన్మకర్మఫలితమే తప్ప తమ తప్పేమీ లేదని కర్మసిద్ధాంతాన్ని వల్లిస్తుంటారు.

డబ్బు సంపాదించడమా ? అబ్బే మాకలాంటి ఆశలేంలేవు. ( నిజానికి డబ్బు సంపాధించడం వీళ్లకు బొత్తిగా చేతకాదు సుమా!) అని బుకాయించడం కొందరికలవాటు కాగా.........ఈ లోకంలోకి వచ్చేటప్పుడు ఎవరమైనా ఏంతెచ్చామని ? పోయేటప్పుడు మనం సంపాధించిన డబ్బుమూటల్ని మోసుకెళ్తామా చెప్పండి ? ( వీళ్లు డబ్బు సంపాధించే ప్రయత్నంలో చేతులు కాల్చుకున్నవాళ్లు ) అంటూ తాత్త్వికతను కాచి వడబోసిన జ్ఞానుల్లా కొందరు ఫోజులు కొడితే, 'డబ్బుదేముందండీ? మంచితనం కావాలి కానీ' (డబ్బు సంపాధించడంలో పూర్తిగా విఫలమైనవాళ్లు వీళ్లే సుమా!) అంటూ సూక్తిసుధల్ని వినిపించేవాళ్లు కొందరు.

<u>నోట్</u> :- డబ్బు సంపాదించడం చేతకానివాళ్లు ఆ ప్రయత్నంలో విఫలమైన వాళ్లు కర్మసిద్ధాంతాన్ని వల్లిస్తారని తత్త్వజ్ఞానాన్ని, సూక్తిసుధల్ని వినిపిస్తారని అంటే "కర్మసిద్ధాంతాన్ని వల్లించేవాళ్లు , తత్త్వజ్ఞానాన్ని, సూక్తిసుధల్ని వినిపించేవాళ్లంతా డబ్బు సంపాదించడం చేతకానివాళ్లు" అని చెప్పడం కాదని ఇందువెంట తమకు మనవి చేసుకుంటున్నాను.

నిజానికి............

నిర్దేశించుకున్న లక్ష్యాన్ని చేరుకొని గెలుపుజెండాను ఎగరేసి సంతృప్తిని పొందేవాళ్లు అతికొద్దిమందే. వీళ్లలో సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకుంటు ఎప్పటికప్పుడు ఎదుటివాళ్ల అంచనాలకు అందకుండా దూసుకుపోతూ అద్భుతమైన విజయాలను దక్కించుకునే వాళ్లు కొందరైతే చిన్నచిన్న లక్ష్యాలను నిర్దేశించుకొని ఎప్పటికప్పుడు తమ గమనాన్ని సమీక్షించుకుంటూ, ముందుచూపుతో వ్యవహరిస్తూ, చిన్నచిన్న అడుగులనే స్థిరంగా, బలంగా వేస్తూ, వెనక్కి తిరిగిచూసుకునే స్థితిని

తెచ్చుకోకుండా, 'నిరంతర పురోగామి' గా నిలుస్తూ, సాహసాలకు పోకుండా, ఏవిధమైన ఒత్తిడులను కొనితెచ్చుకోకుండా, నెమ్మది నెమ్మదిగా లక్ష్యానికి చేరువై గెలుపును దక్కించుకునేవాళ్లు కొందరు తాము సాధించిన విజయాలపట్ల సంతృప్తిని పొందుతూనే సాధించిన దాన్ని సద్వినియోగం చేయడంలో శ్రద్ధ వహించే వీళ్లే 'డబ్బు సంపాదించి కోటీశ్వరులుగా ఖ్యాతి గడించాలన్న కోరిక అనేకుల్లో కలగడానికి కారకులు.

నిరంతర శ్రమను నమ్ముకోవడం, దక్కిన అవకాశాల్ని సద్వినియోగం చేసుకోవడం, సరియైన నిర్ణయాలు తీసుకోవడం, సమయపాలనను పాటించడం, దూరదృష్టితో వ్యవహరించడం, సంతృప్తిని పొందడం వంటి గుణాలే వీళ్ల విజయాలకు సోపానాలై నిలిచాయని వీళ్ల చరిత్రల్ని పరిశీలిస్తే ఎవరికైనా అవగతమౌతుంది.

చివరగా.........

జీవితంలో డబ్బు సంపాధించడం అవసరం. తప్పనిసరైన అవసరం ఎవరికీ తప్పని, తప్పించుకోలేని అవసరం కాదనలేం. కాదని ఎవరైనా అంటే వారి మాటలకు ఈ సమాజం ఎంతమాత్రం విలువివ్వదు. అయితే జీవితంలో డబ్బు సంపాదించడమే సర్వస్వం కాదని అంటే జౌననేవాళ్లు అనేకులుంటారు.

డబ్బు సంపాదించడం జీవితంలో ఒక భాగం మాత్రమేనంటే ఎవరికీ పెద్దగా అభ్యంతరముండక పోవచ్చు. జీవితంలో డబ్బు సంపాదించడం, ప్రేమ (ప్రేమించడం ప్రేమించబడం ). భాధ్యతానిర్వహణ, ఉన్నతస్థానానికి చేరుకునేందుకు ప్రయత్నించడం, నలుగురిలో గౌరవంగా (ధర్మబద్ధుడై, సంఘనియమాలను పాటిస్తూ) బతకడం, సంతృప్తిని సాధించడం వంటి అనేక అంశాలుంటాయిని మనవి చేసుకుంటున్నాను.

అన్ని అంశాలను స్పృశిస్తూ సాగితేనే అది పరిపూర్ణజీవితమౌతుందని ఇందులో ఏ ఒక్కటి లోపించినా అది అసంపూర్ణ జీవితమేనన్నది పూర్తిగా నిజం. అసంపూర్ణ జీవితం అర్ధరహితమై, సమస్యలకు నిలయమై జీవితం యొక్క అర్థాన్ని లక్ష్యాన్ని, ఉద్దేశాన్ని దెబ్బతీస్తుందనే విషయాన్ని ఈసందర్భంగా మీ అందరికీ మళ్లీ ఒకసారి గుర్తు చేస్తున్నాను.

అందుచేత,

"జీవితంలో డబ్బు సంపాధించండి. ఆ లక్ష్యంలో పడిపోయి మిగతా అంశాలను నిర్లక్ష్యం చేసి జీవితంలోని మధుర్యాన్ని కోల్పోకండి " అని మనవి చేయదలిచాను.



# అధికారమే పరమావధి

డబ్బుతో సమానంగా ప్రభావాన్ని చూపించగల మరొకశక్తి అధికారం ఇది డబ్బు కంటే ప్రాచీనమైనది కావడం విశేషం "సమాజం యొక్క అభ్యున్నతే ధ్యేయంగా, సమాజం చేత రూపొందింపబడిన ఒకానొక విశిష్ఠ ధర్మమే అధికారం' కాగా 'సేవానిరతి' 'త్యాగగుణం' 'సమదృష్టి' 'పర్యవేక్షణ' లనే నాలుగు పాదాల (గుణాల) తో నడచినప్పుడే అధికారం ఒక విశిష్ట ధర్మంగా గుర్తింపబడుతుంది, గౌరవింపబడుతుందనే విషయం ఈ సందర్భంగా గమనార్హం.

☆ సమాజంలో భాగస్వాములైన ప్రజలంతా తమతమ విద్యుక్త ధర్మాలను సక్రమంగా నిర్వర్తించేలా ప్రోత్సహించడం,

☆ ప్రకృతివల్ల, ప్రకృతిలోని ఇతరేతర శక్తులవల్ల, సమస్త జంతుజాలం వల్ల, సాటి మనుష్యులవల్ల, నష్టపోయిన, దెబ్బతిన్న వాళ్లను ఆదరించడం, తగినసేవలను అందించడం.

భిన్న కారణాలతో జీవితం పట్ల విముఖులైనవాళ్లను, విరక్తులను తిరిగి జీవితంపట్ల అనురక్తుల్ని చేయడం. వంటివి అధికారానికి నిర్దేశింపబడిన కొన్ని ముఖ్యమైన బాధ్యతలు.

తనకు నిర్ధేశింపబడిన బాధ్యతల నిర్వహణకై చిత్తశుద్ధితో కృషిచేసినప్పుడే అధికారం అందరిమెప్పును పొందగలుగుతుందన్నది నిర్వివాదాంశం. మొదట్లో అధికారం అందరి మెప్పునూ పొందుతూ ఒక విశిష్ట ధర్మంగానే భాసించింది. సమాజ అభ్యున్నతికి ఎంతగానో దోహదకారి అయ్యింది. అయితే కాలక్రమాన తన బాధ్యతల నిర్వహణను మరింతగా సులభతరం గావించుకునే ఉద్దేశంతో అది' సూచన' ( ఇది తర్వాతి కాలంలో ఆజ్ఞగా ఎదిగింది) 'దండన' ల సహకారాన్ని తీసుకున్నది. ఎప్పుడైతే అధికారం సూచన, దండనల సహకారాన్ని తీసుకున్నదో అప్పుడే దానిపైనున్న గౌరవం తొలిగిపోయి ఆ స్థానాన్ని భయం ఆక్రమించుకున్నది. తర్వాతి కాలంలో అధికారం ఒక ' ధర్మం 'స్థాయి నుండి 'శక్తి' గా రూపాంతరం చెందింది.

శక్తిగా అవతరించిన అధికారంపై అనేకులకు ఆసక్తి కలిగింది. అధికారాన్ని హస్తగతం చేసుకోవాలన్న ఆరాటమూ పెరిగింది. ఒక హక్కుగా, ఒకహోదాగా అధికారాన్ని అనుభవించడం కోసం అనేకులు పోటీపడ్డారు.

పోటీపెరిగిపోయిన నేపథ్యంలో అధికారం కొన్నిసార్లు అనర్హుల, అసమర్థుల చేతుల్లో చిక్కి అవస్థల పాలయ్యింది. అస్తవ్యస్తంగా తయారయ్యింది. ఆనవాళ్లు గుర్తించలేనంతగా మారిపోయింది. జారిపోయింది. కొన్నిసార్లు సమర్థుల చేత పునరుద్ధరింపబడినా అది కొంతకాలమే అయ్యింది. అధికారంలోని ధర్మగుణాలు క్రమేపీ తెరమరుగై పోగా, దానికి సహకరించే నెపంతో తోడైన ఆజ్ఞ దండనాశక్తులు విజృంభించి అధికారం యెక్క అర్థాన్ని, స్వరూపాన్ని సమూలంగా మార్చివేశాయి.

## ఆధునిక కాలంలో

ఆధునిక కాలంలో అధికారం ఒక మత్తుపదార్థం సాధారణంగా మత్తుపదార్థాలన్నీ మనిషికి చెరుపు చేసేవేననడంలో ఎలాంటి సందేహం లేదు. అధికారంలోని మత్తు కూడా అందుకు అతీతం కాదు. ఇతర మత్తుపదార్థాలకు బానిసైనవాడు శారీరకంగా, మానసికంగా,సాంఘికంగా, ఆర్థికంగా బలహీనపడిపోతాడు. కాగా అధికారంలోని మత్తుకు బానిసైనవాడు మాత్రం అన్నిరకాలుగా బలపడిపోతాడు. అధికారం లోని మత్తుకు అంతటి మహత్తూ ఉంది మరి.

అధికారంలోని మత్తుకు ఈ దేశంలో ఉన్నంత మంది బానిసలు ప్రపంచంలో మరెక్కడా లేరంటే అతిశయోక్తి కానీ, అబద్ధం కానీ కాదు. అధికారం కోసం జరిగిన పోరాటాల్లో చిందిన రక్తంతో ఈ భరతనేలంతా తడిసిపోయిందని మన చరిత్ర మొత్తుకుంటుంది. అధికారమదంతో విర్రవీగి ఆనక మట్టిలో కలిసిపోయిన అంధకాసురుల సంఖ్యకు అంతేలేదు. అధికారం కోసం మనిషి ఎంతటి పాపానికి ఒడిగట్టగలడో, ఎంతటి నీచానికి దిగజారగలడో, ఏ విధమైన క్రూరత్వాన్ని వెదజల్లగలడో, ఎంతటి అమోఘమైన నటనను ప్రదర్శించి రక్తికట్టించగలడో..... అంతకు అంతగా మరింతగా పాపానికి ఒడిగట్టిన వాళ్ళు దిగజారినవాళ్ళు, క్రూరత్వాన్ని వెదజల్లిన వాళ్లు తమ అసమాన నటనాకౌశలాన్ని ప్రదర్శించిన వాళ్లు ఇక్కడ అనేకులు.

ఇంతటి ఘనమైన చరిత్రను కలిగి ఉన్న దేశంలో అధికారపిపాసుల గురించి, వాళ్ల వారసుల గురించి, వాళ్లూ, వీళ్లూ ప్రవర్తించిన తీరుతెన్నుల గురించి నాలుగు ముక్కలు (అన్నీ కలిపితే మహాభారతాన్ని మించిన గ్రంథమౌతుంది కాబట్టి) చెప్పకుందాం.

## అల్లాటప్పాగాడు అసలు సిసలైన వాడై వెలిగిపోతాడు

ఇది అక్షరాలా నిజం అప్పటివరకు అమాయకమైన క్రిందిస్థాయి ఉద్యోగిగానో/ నిరుద్యోగిగానో కాలం వెల్లబుచ్చుతున్న ఒక మామూలు మనిషికి అవకాశం కలిసొచ్చి అధికారం అందివచ్చిందే అనుకొండి. అంతే, అప్పటివరకు మనవాడు చేసిన, చేస్తున్న వెధవపనులన్నింటికీ అకస్మాత్తుగా ఫుల్‌స్టాప్ పెట్టేస్తాడు. వేషభాషలతో పాటుగా చూపులనూ,నడకనూ, సమూలంగా మార్చుకుంటాడు 'కర్తవ్యం' 'బాధ్యత' 'క్రమశిక్షణ' డ్యూటీ ముఖ్యం' అంటూ చిలుకపలుకుల్ని వల్లించుతుంటాడు. తోటివాళ్లపైన తన ఆధిపత్యాన్ని నిరూపించుకోవాలని తెగ ఆరాటపడిపోతుంటాడు. తన గురించి, ఇటీవలి తన ప్రవర్తన గురించి, తోటివాళ్లు, ఎదుటివాళ్లు ఏమేమో మాట్లాడుకుంటున్నారని ఊహించుకుంటాడు. ఏం మాట్లాడుకున్నదీ తెలుసుకోవాలని ఉబలాటపడతాడు ఒకరిని కాదని మరొకరిని పలకరిస్తూ, ఒకరి ముందర వేరొకరి గురించి మాట్లాడుతూ, ఆరాలు తీస్తూ..... కూపీలు లాగుతుంటాడు. చివరగా మనవాడు సాధించేది శూన్యమే అయినా, ఈ తరహా ఎత్తుగడలు వేస్తూండడాన్ని మనం సులభంగానే గమనించగలం. ఒక అల్లాటప్పాగాడు ఇంత గ్రంథాన్ని నడిపించడమనేది కేవలం అధికారం చేజిక్కడం వల్లనే కదా! అంతేకాదు.

## అనామకుడు అమాత్యుడై రాజ్యమేలుతాడు

ఈమాటలు అక్షరసత్యాలని మీకు నచ్చచెప్పనవసరం లేదు. నమ్మించపనిలేదు. ఎందుకంటే ఈ బాపతు కేసులను పెక్కింటిని మీరు స్వయంగా పరిశీలించి ఉంటారు. అధికారం అందని ద్రాక్షపండులా ఊరిస్తూంటే అందుకోవాలని ఆరాటపడి, పోరాటం చేసి, దొంగదెబ్బలు తీసి, వెన్నుపోట్లకు పథకాలు రచించి, నమ్మించి నట్టేట్లో ముంచి, నానారకాలుగా ప్రయత్నించి, ఎత్తులువేసి, ఎత్తులకు పై ఎత్తులు వేసి పరువు మర్యాదల్లాంటి వాటిని తాకట్టుపెట్టి, మంచితనం, మానవత్వం వంటి వాటిని వదలిపెట్టి, నీతి, నిజాయితీ లాంటి వాటిని టోకున అమ్ముకొని గద్దెలనెక్కిన అనుభవం అనేకమంది పెద్దలకు స్వంతం.

అవకాశాలు అలా కలిసిరాగా..... అమాత్యపీఠాన్ని అధిరోహించిన ఓ అనామక చక్రవర్తి ఆ క్షణంనుండే అధికార కార్యక్రమాల్లో తలమునకలై పోతాడు. అత్యంత విలువైన ప్రాణాలు ( ఎక్స్, వై, జడ్ కేటగిరిల భద్రత) కలిగున్నవాడై పగలు, రాత్రి అనే తేడా లేకుండా సభల్లో, సదస్సుల్లో సమావేశాల్లో, సమాలోచనా కార్యక్రమాల్లో సొంతంగా పాలుపంచుకుంటూ ఉంటాడు. (వెంట భద్రతా సిబ్బంది, మందీ మార్బలం, వగైరా, వగైరాలు వెన్నంటి ఉంటాయి)

ప్రతి పనిలో వ్యవహారంలో తలదూర్చుతాడు. కాళ్లూ, వేళ్లూ దూర్చకుండా ఉండలేడు. తన పవరెంతో, బరువెంతో చూపిస్తాడు. అన్నింట్లోనూ తనదైన ముద్ర బలంగా వేయాలని చూస్తాడు. అడిగినవాళ్లకు, అడగని వాళ్లకూ అనే తేడా లేవీ లేకుండా అందరికీ టన్నులకొద్దీ మాటల్ని నిరంతరంగా నిరాఘాటంగా, నిస్సంకోచంగా దానం చేస్తూనే ఉంటాడు.

ఇంతటి మహానుభావున్ని ఎరక్కపోయి, పొరపాటున బుద్ధిగడ్డితిని పలకరించామే అనుకోండి, ' ప్రజాసేవ ' 'ఆత్మగౌరవం ' 'దేశాభివృద్ధి ' ' సమసమాజం 'దీనజనోద్ధరణ ' 'పీడిత , తాడిత వర్గాల అభ్యున్నతి అంటూ ఎదుటివాళ్ళు దిమ్మతిరిగి పడిపోయేలా స్టేట్‌మెంట్లు గుప్పిస్తూనే ఉంటాడు.

ఒక అనామకుడికి ఏ గురువూ చెప్పకుండానే (టాప్ పొజిషన్లో ఉన్న ఒకానొక నాయకున్ని గురిచూసుకొని, తన గురువుగా తనే ప్రకటించుకుంటాడు) ఇన్ని తెలివితేటలు ( ఈ తరహా తెలివితేటల్ని నేర్పించగలిగే శక్తి మన గురువులకు లేదులే ) అబ్బడం కేవలం అధికారంలోని మహాత్మ్యం వల్లనే కదా! ఇంకా........

## అర్భకుడు అధికారిగా చలామణీ అవుతాడు

పోలీసుల పేరు వింటేనే మాట తడబడే ఒక అమాయక చక్రవర్తికి అనుకోకుండా పోలీసాఫీసరుగా ఉద్యోగం వచ్చింది. ఈ ఉద్యోగం తనకు సరిపడదని నిర్ణయించుకొని అందులో చేరకూడదనుకుంటాడు మన చక్రవర్తి. కానీ మిత్రులు, శ్రేయోభిలాషులంతా కలిసి మనవానికి నచ్చచెబుతారు. బలవంతం చేస్తారు. అంతా కలిసి కూడబలుక్కొని మనవాన్ని ఉద్యోగంలో చేర్పించేదాకా నిద్రపోలేదంటే నమ్మండి. అయిష్టంగానే మనవాడు ఆ ఉద్యోగంలో చేరిపోయాడు. భయం భయంగానే బాధ్యతల నిర్వహణ ప్రారంభమైంది. ఆ తర్వాత కాలం గడిచే కొద్దీ మనవాడు రాటుదేలిపోయాడు. మిత్రులు, శ్రేయోభిలాషులంతా ముక్కున వేళ్లేసుకొని ఔరా! అని ఆశ్చర్యపడే విధంగా మనవాడు తయారయ్యాడంటే నమ్మండి.

ఇప్పుడు

మనవాడు అలనాటి అమాయకపు చక్రవర్తి కాడు. 'రాక్షసుడు' 'గుండెలు తీసిన బంటు' 'గండరగండడు' 'చండశాసనుడు' వగైరా..... వగైరా...... అన్నీనూ మన చక్రవర్తి పేరు చెబితే చాలు క్రిందిస్థాయి ఉద్యోగులకే కాదు. సహద్యోగులకు పై స్థాయి ఉద్యోగులకు కూడా హడలేనంటే నమ్మండి. అంతటి అమాయకుడు ఇంతటి చండశాసనుడుగా మారిపోవడానికి అధికారమే కారణమంటే కాదనగల దమ్ములెవరికున్నాయో చెప్పండి.

మరో ఉదాహరణ చూద్దాం.

మొదట్లో అతడొక సాధారణ ప్రభుత్వోద్యోగి చాలామందికి మల్లే ప్రభుత్వోద్యోగమంటే పనిచేయకుండానే జీతం తీసుకోవడానికి లభించిన సువర్ణావకాశమని (కొండొకచో జన్మహక్కని తలంచే మహానుభావులూ ఉన్నారు.) భావించిన వాడు వేళకు ఆఫీసుకు రావడమన్నా సాయంకాలం ఆఫీసుకట్టేసే వరకూ ఉండడమన్నా, ఉన్నంతసేపూ సీట్లో కూర్చుని బుద్ధిగా పనిచేయడమన్నా అతనికి సుతరామూ ఇష్టముండేది కాదు. తనపై పనిచేసే అధికారులంటే అతనికి ఒళ్లుమంటగా ఉండేది. నిరంతరం రూల్స్, రెగ్యులేషన్స్, టైమ్ పంక్చువాలిటీ, డ్యూటీ...... అంటూ అధికారులంతా ఉద్యోగులను హింసిస్తారని అతని అభిప్రాయంగా ఉండేది.

కాలక్రమాన కొన్నిశక్తులు సహకరించిన నేపథ్యంలో

మనవాడు ఉన్నతాధికారి అయ్యాడు. అప్పటివరకూ అతనితో కలిసి పనిచేసిన సహోద్యోగులంతా ఎంతో సంతోషించారు. తమ స్థాయి ఉద్యోగుల సాధకబాధకాలు తెలిసినవాడు. తమను పరిపాలించే ఉన్నతాధికారి అయితే ఇంక తమకు కష్టాలనేవే ఉండవని సంతోషించారు. (వెర్రినాగన్నలు)

ఉద్యోగిగా మనవాని ఆలోచనలు, ప్రవర్తన, వ్యవహారాదులు వేరు. ఉన్నతాధికారిగా మనవాని ఆలోచనలు ప్రవర్తన, వ్యవహారాదులు వేరు. ఇప్పుడు మనవానికి ఉద్యోగులంటే ఒళ్లుమంట, వాళ్లంతా పని చేయకుండానే జీతం తీసుకోవడానికి ప్రభుత్వోద్యోగంలో చేరిన చవటలని,మనవాని నిశ్చితాభిప్రాయం, సదరు ఉద్యోగులంతా వేళకు ముందే తమ తమ స్థానాలను చేరుకోవాలని, ఆఫీసుకట్టేసే వరకు తమ సీట్లనుండి కదలడానికి వీల్లేదని, ఉద్యోగులందరూ ప్రతిరోజు తాము చేసిన పని తాలూకు వివరాలను పై అధికారులకు రిపోర్టుగా తప్పనిసరిగా వ్రాసి పంపాలని మనవాడొక నియమావళిని రూపొందించాడు. ఆ నియమావళిని పాటించని వాళ్ల తోకలు తెగ్గోస్తాననే హెచ్చరికలతో సదరు నియమావళిని అన్ని ఆఫీసులకు పంపించాడు.

పనిచేయని ఉద్యోగులందరినీ నిలబెట్టి షూట్ చేయాలన్నది ప్రస్తుతం మనవాని నిశ్చితాభిప్రాయం.

ఇంతటి మార్పు అధికారం వల్ల కాకుండా మరి దేనివల్లనైనా సంభవిస్తుందా? చెప్పండి ?

గొప్ప ప్రజానాయకునిగా వెలిగిపోవాలని, అంతకంటే గొప్పదైన పదవిలో (గవర్నర్ గిరీయో, దానికి సరిసమానమైనదో ) చిరకాలం నిలిచిపోవాలని కలలు కనేవాళ్లు అనేకులు. తమ కలల్ని సాకారం చేసుకోవడానికై వీళ్లు రాజకీయరంగంలో అడుగుపెడతారు. ప్రజాసేవ బురఖా వేసుకొని గల్లీ నుండి ఢిల్లీదాకా ఇలా తిరుగుతున్న పరాన్నజీవులను మీరు చూసే ఉంటారు. వీళ్లలో అనేకులు ఆత్మల్ని వంచించుకొని పరువును పాగొట్టుకొని గౌరవమర్యాదల్ని గాలికొదిలేసి జీవితాల్ని గడుపుతున్నారన్న విషయం మీకు తెలియందేమీ కాదు. వీళ్లంతా కేవలం అధికారం పైనుండే మమకారాన్ని చంపుకోలేకే ఇలా తయారయ్యారన్నది కూడా మీకు తెలిసిన విషయమే.

అధికారపదవుల్ని పొందడం కోసం అడ్డదారుల్ని తొక్కే వాళ్లు కొందరు అడ్డువచ్చిన వాళ్లను అడ్డంగా నరకడం ద్వారా రాజకీయాల్లో రాక్షస విలువల్ని నెలకొల్పిన వాళ్లు కొందరు. వీళ్లననుసరించే వాళ్లు మరికొందరు. అసలేమాత్రం ఇష్టం లేక పోయినప్పటికినీ వీళ్ల మూలంగా అధికారపదవులను వదిలేసిన వాళ్లు ఇంకొందరు. అధికారాన్ని అనుభవించడమే ప్రజాసేవకు పరమార్థంగా భావించేవాళ్లు కొందరైతే పరిస్థితులు ఇంతగా దిగజారిన కారణంగా ప్రజాసేవారంగం నుండి తప్పకున్న వాళ్లు చాలా అరుదుగానైనా కొందరు కనిపిస్తారు. ఏమాటకామాటే చెప్పకోవాలంటే అధికారాన్ని సంపాదించేవరకు అహర్నిశలూ శ్రమించి (లక్షలు ఖర్చుపెట్టి ) అదికాస్తా దక్కాక అందినంతమేరా (లెక్క కోట్లలో ఉండవచ్చు) దండుకునే మారాజులు దండిగానే ఉన్నారు సుమా! తమకు అధికారాన్ని కట్టబెట్టిన అమాయక ప్రజల్ని పూర్తిగా మరిచిపోయే మహానుభావులు అనేకులని వేరే చెప్పాలా!.

ఒకాయనున్నాడు పేరు 'పెద్దమనిషి' (మొదట్లో ఈ పేరుండేది కాదు. రానురాను వయసు పెరిగింది. కాబట్టి పాత పేరును వదిలేసి ఈయన అనుచరగణమే ఈపేరు పెట్టారు.) అప్పుడెప్పుడో అర్ధశతాబ్దం క్రితం అత్యాచారప్రయత్నమో, హత్యాప్రయత్నమో, దొంగతనమో, (క్షమించండి సరిగ్గా గుర్తులేదు) చేశాడు. లాఠీదెబ్బల రుచి చూశాడు. కటకటాల వెనకాల నిలిచాడు. సరిగ్గా అప్పుడే అక్కడే ఒక రాజకీయ నాయకున్ని చూశాడు. ఆ ఠీవీ, డాబూ, దర్పం, అన్నీ మనవానికి బాగా నచ్చాయి. అన్నింటికీ మించి ఆ నాయకునికి జైల్లో లభిస్తున్న గౌరవమర్యాదలు ఇంకా నచ్చాయి. అంతే తన బుర్రలో ఆలోచనొకటి మెరుపులా మెరిసింది. ఇంక చెప్పేదేముంది .జైలునుండి విడుదలైన ఉత్తరక్షణంలో మనవాడు రాజకీయనాయకుని అవతారమెత్తాడు. హంగుల్ని కూర్చుకున్నాడు. ఆర్భాటాల్ని చేశాడు. అనుచరగణం దానంతటదే వచ్చి చేరింది. అదిగో అప్పటి నుండి..........

అధికారం కోసం కలలు కనడం మొదలుపెట్టాడు. మొదట్లో అవకాశాలు కలిసొచ్చినట్లే అనిపించాయి. అధికారపీఠం దక్కినట్లే దక్కి, దక్కకుండా పోయింది. అయినా మనవానిలో ఆశచావలేదు. అలనాటి విక్రమార్కున్ని మరిపిస్తూ, అపర విక్రమార్కునిలా తయారైపోయి అధికారంకోసం ఎదురు చూస్తూనే ఉన్నాడు. ఈయనకంటే ముందు ఈయనలాంటి వాళ్లు కొందరు అధికారం కోసం అహర్నిషలూ ఆరాటపడి అది తీరకుండానే కాలధర్మం చెందడాన్ని కళ్లారా చూశాక కూడా మనవాడు నిరాశ చెందలేదు. కాటికి కాళ్లు చాపుకునే వయసొచ్చినా అధికారం కోసం పగటికలలు కనడం మానుకోలేదు.

అధికారం విషయంలో మనిషి ఆశ ఏ స్థాయిలో (ఎంత తీవ్రంగా) ఉంటుందన్న విషయం ఈయనను, ఈయనలాంటి వాళ్లను చూస్తేనే తెలుస్తుంది సుమా!.

"పదవి లభిస్తుందని తెలిస్తే పాడె మీది శవమైన లేచివస్తుంద" న్న ఒకానొక పెద్ద మనిషి మాటల్ని ఈ సందర్భంగా గుర్తుచేసుకోవడం అసందర్భం కాదు కదా!

మరొకాయనున్నాడు..........

నిజంగా పెద్దమనిషే అనుభవజ్ఞుడని అనేకులకు ఆమోదయోగ్యుడని, అందరినీ కలుపుకొని పోగల సమర్థుడని, అజాతశత్రువని, హైకమాండు వారు అధికారపీఠంపై కూర్చుండబెట్టారు. (అటు తర్వాత దాన్ని రాజకీయలబ్ధికి వాడుకోవాలన్నది హైకమాండు వారి ఆలోచనలెండి) ఈయనలాంటి మంచివానికి పదవి దక్కినందుకు ప్రజలంతా ఎంతో సంతోషించారు.

కొద్దిరోజులు బాగానే గడిచాయి. మొదట్లో ఈయన వెంట ఉంటూ ఈయన చేసే పనుల్లో చేదోడు వాదోడుగా ఉండే అల్లుడుగారు రాను రాను అధికారంపై మక్కువను పెంచుకున్నాడు. రాజ్యాంగేతర శక్తిగా ఎదిగి మామగారికి బదులుగా అధికార కార్యక్రమాల్లో తనే పాల్గొంటున్నాడు. పర్యటనలు, విందులు, వినోదాలు, ఒప్పందాలు కుదుర్చుకోవడం వంటి వ్యవహారాలన్నీ దిగ్విజయంగా నిర్వహిస్తున్నాడు. విధాన నిర్ణయాలన్నీ అల్లుడుగారి కనుసన్నల్లో జరుగుతుండగా మామగారు సంతకాలకే పరిమితమయ్యారు.

కాలక్రమాన అధికారంలోని మత్తు అల్లుని చేత అక్రమాలకు తెరతీయించగా, మామగారి పరువు పత్రికల్లోని పతాక శీర్షికల్లో ఉతికి ఆరేయబడింది. పోయిన పరువును పైకంతో దక్కించుకోవాలనుకున్న అల్లుడుగారి ఆశలన్నీ అడియాసలు కాగా మామగారి పదవి మట్టి కొట్టుక పోయింది.

ఇంత జరిగినా సుంతైనా చింతలేని మామగారితో పాటు 'తాము అమాయకులమ'ని స్టేట్‌మెంట్లిచ్చిన అల్లుడుగారు మళ్లీ అధికారం కోసం పగటికలలు కంటుండడం, పావులు కదుపుతుండడం ఈ వ్యవహారంలో కొసమెరుపు.

'కొందరికి అధికారం ముందు పరువు, ప్రతిష్టలు, మర్యాద, మన్ననలు బలాదూర్' అంటే మీలో ఎవరైనా కాదనగలరా ?!

అధికారపీఠంపైన ఆత్మీయులనో, అర్ధాంగినో, అనుచరముఖ్యులనో కూర్చుండబెట్టి, తాము చక్రం తిప్పడమంటే కొందరికి అమితమైన ఆసక్తి. సమానత్వం కోసం, అణగారిన వర్గాల అభ్యున్నతి కోసం రాజ్యాంగం కల్పించిన రిజర్వేషన్లను ఇలా సద్వినియోగ పరిచిన సత్పురుషులు దేశమంతటా ఉన్నారు.

అధికారం తమకు హక్కుభుక్తంగా భావించే వాళ్లను, వారసత్వంగా మిడిసిపడే వాళ్లను, డబ్బు వెదజల్లి అధికార పీఠాన్ని కొనుక్కునే వాళ్లను, దాన్నే ఊపిరిగా చేసుకొని జీవిస్తున్నవాళ్లను ఎందరినో మీరు కళ్లారా చూస్తూ, వాళ్ల ఘనకార్యాలకు సంబంధించిన వార్తల్ని చెవులారా వింటూ తరిస్తూనే ఉన్నారు కదా !

అధికారం యొక్క ఘనతకు, మహత్యానికి, వీళ్లంతా సాక్ష్యంగా నిలుసార్తన్న విషయంలో మీరంతా నాతో ఏకీభవిస్తారనే నమ్ముతున్నాను.

నిజానికి...........

అధికారాన్ని అధికారంగా కాకుండా బాధ్యతగా భావించే వాళ్లు అతికొద్దిమందే. అధికారపీఠంపైన కూర్చునప్పటికినీ ఆవగింజంతైనా అహంకారాన్ని దరి చేరనీయకపోవడమన్నది చాలా కొద్ది మందికీ మాత్రమే సాధ్యమౌతుంది. అది వాళ్ల హృదయసంస్కారమనే చెప్పాలి.

అధికారానికి విచక్షణను జోడించి విలక్షణతను సాధించేవాళ్లు కొందరు కాగా. అధికారానికి నిరంతరశ్రమను మేళవించే వాళ్లే సమర్థులుగా పేరు పొందగలరు. అధికారానికి నీతి, నిజాయితీలను జత చేసిన వాళ్లు అరుదుగా కనిపిస్తారు.

చివరగా..........

అవకాశం కలిసి రావడంవల్ల కానీ, అదృష్టం పలకరించడం వల్ల కానీ సమర్థత గుర్తింపబడడం వల్ల కానీ, తనలోని నీతి, నిజాయితీలకు ప్రతిఫలంగా కానీ, మరేవిధంగా నైనా కానీ తనకు అధికార పీఠం దక్కితే.............

"రాజ్యంబు కలిగెనేనియు
పూజ్యులకును యాచకులకు భూమి సురులకున్
బాజ్యముగ బ్రతుకడేనియు
దాజ్యంబులు వాని జన్మధనగేహంబుల్-"

అని బలిచక్రవర్తిని బోధించిన వామనుడు సెలవిచ్చినట్లుగా..........

మహనీయులకు, మాన్యులకు, గొప్పవాళ్లకు, ఇతర రంగాలలో దేశానికి కీర్తి ప్రతిష్టల్ని తెచ్చేవాళ్లకు, ఆర్థికంగా, సామాజికంగా జ్ఞానపరంగా వెనుకబడిన వాళ్లకు, అణగారిన వర్గాలకు, పండితులకు జ్ఞానులకు, ఆధ్యాత్మిక, తాత్విక చింతనాపరులకు, సత్పురుషులకు సంతృప్తిని కలిగించగలిగేలా వ్యవహరించాలి.

అలా వ్యవహరించడం ఇష్టం లేక పోతే ?

☆ అధికార పీఠాన్ని ఎక్కనేకూడదు.
అలా వ్యవహరించడంలో విఫలమైతే ?

☆ తక్షణమే అధికారాన్ని వదులుకోవాలి.

ఒక్కమాటలో చెప్పాలంటే !

అధికారాన్ని అధికారంగా కాకుండా " ఇతరులకు సేవచేయడానికి తనకు దక్కిన మహాభాగ్యంగా" భావించి శ్రద్ధాసక్తులతో నిర్వర్తించాలి.

అలా నిర్వర్తించేవాడే ధన్యుడని మనవి చేసుకుంటున్నాను.

